శ్లో॥ అష్టశాఖం చతుర్మూలం షష్టిపత్రం ద్వయేస్థితం ।
షట్పుష్పం త్రిఫలంవృక్షం యోజానాతి స నీతివిత్ ॥

గీ॥ ఆరు పర్వదియును విరు శాఖ కొమ్మ
లెనిమిదియు మూఁడుఫలములు సునికి రెంటి
యందు వేరులు నాలుగు నమరు ద్రుమాను
నెఱుఁగు వాఁడిట్టి నయగతి నెఱుఁగువాఁడు ॥ 15

వ॥ ఇందలి యభిప్రాయము 16

సీ॥ అరివిజిగీషుల రిపువుల కగు మిత్రు
లెనమండ్రును శాఖ లెనిమిదియును
మధ్యమోదాసీన మానవేంద్రులు నరి
విజిగీషువును నన ద్రేష్ఠ నాల్గు
నిహిత ద్వాదశరాజ మండలమున కెప్డు
నైదే ప్రకృతుల నమరఁ గూడి
విపుల నర్వాది మండలము లగు నదియును
షష్టిపత్రంబులు షడ్గుణములు

గీ॥ సంధి విరుల నయానయ యత్నయుగళ
మెపుడు సునికి క్షయస్థానవృద్ధులనఁగ
నలరు త్రిఫలంబులును గలయట్టి ద్రుమాను
నెఱుఁగు వాఁడిట్టి నయగతి నెఱుఁగువాఁడు ॥ 17

వ॥ ఇందుకు మఱియొక పద్యము.

సీ॥ గుణములను గృహలాదిగాఁ గలయష్టవ
ర్గంబునునట్టి శాఖలును గల్గి
సామంబు మొదలైన చతురుపాయములను
దాఁపొందునట్టి వేరులును గల్గి

యుల విజిగీషుమండలమున కై దేసి
ప్రకృతులతో నెనుబదియు నవియు
రమణ సర్వాది మండలము లగు నవియును
షష్టి పత్రమ్ములు షడ్గుణములు

గీ॥ ననెడి విరుయి నయానయ యత్నయుగళి
నెపుడు సునికి క్షయస్థానవృద్ధు లనఁగ
నలరు త్రిఫలంబులును గల యట్టి క్రమము
నెఱుఁగువాఁ డిట్టి నయగతి నెఱుఁగువాఁడు ॥ 18

వ॥ కావున నందు నీ చెప్పిన ద్వాదశరాజమండలంబుల యుక్తి
క్రమంబుఁ గ్రమంబున వివరించెద. 19

మండలచరిత ప్రకరణము

సీ॥ అలవిజిగీషువై నట్టి రాజునకును
వెనుకఁ బార్ష్ణిగ్రాహుఁ డనెడి రాజు
నవలఁ బార్ష్ణిగ్రాహకాసారుఁడను రాజు
శత్రువు లగుదు రీజగతిలోన
నాక్రందుఁడను రాజు నాక్రందకాసారుఁ
డను రాజు మిత్రులై యొనరుచుండ్రు
కావున నచ్చోటఁ గలిగిన మిత్రభూ
వరులచే శత్రుభూవరుల కెపుడు

గీ॥ గదలఁగా రాక యుండఁ బో రొదవఁ జేసి
తనకు ముందరఁ గల్గు శాత్రవుల మీఁద
దండు గదలంగవలయు నుద్దండలీల
వినుతి కెక్కుచు జయముఁ జేకొనెడికొఱకు ॥ 20

సీ॥ అటులనే విజిగీషువై నట్టి భూపతి
రసికుఁడై నీతిమార్గంబు మెఱసి
తన శత్రుమీఁదటఁ దన మిత్రభూపతి
దన శత్రుమిత్రుపైఁ దనదుమిత్ర
మిత్రుఁడై నట్టి భూమీపతిఁ గవియింప
నగు వారి కందఱ కవలనుండఁ
దనయరిమిత్రమిత్రుని గదలకయుండ
నటఁగృతకృత్యుఁడై యధికుఁడై న

గీ॥ యుభయమిత్రుల రేఁచి పోరాదవఁ జేసి
తనకుఁ బిమ్మటఁగల్గు శాత్రవులమీఁద
దండు గదలంగ వలయు నుద్దండలీల
దనుతి కెక్కుచు జయముఁ జేకొనెడి కొఱకు ॥ 21

వ॥ మఱియు నిట్టి విజిగీషువగు రాజు దనమిత్రుఁడుం దాను నిద్దరిద్దరుఁ గూడి యెదనెదనయుండెడి తన శత్రువుల నటుదిక్కులను జిక్కించక యుక్కడంచి జయించి మిందు తెఱంగు విపరించెద. 22

సీ॥ తానును నాక్రందధారుణీపతియుఁ బా
ర్ష్ణిగ్రాహు నొవ్వఁగాఁ జేయవలయు
నాక్రందు నాక్రందనాసారు ననికంపి
పార్ష్ణిగ్రహాసారుఁ బఱుపవలయుఁ
దనమ మిత్రుండును దానుఁ గూడుక తన
యరిరాజుఁ బెకలించి చెఱుపవలయుఁ
దనమిత్రుచేతను దనమిత్రమిత్రుచేఁ
దనయరిమిత్రునిఁ దఱుమవలయు

ఆ॥వె॥ సుభయమిత్రుచేత నొగి మిత్రమిత్రుచే
శత్రుమిత్రమిత్రుఁ జెఱుపఁబలయు
నిటుల సహితవరుల నెఱుఁగఁడ గదుముచు
గెలువఁబలయు నల జిగీషువునకు ॥ 23

కం॥ ఈరీతి రెండుగడలన్
నేరుపుతో గెలువఁగోరు నృపతి గదిమినన్
పైరులు మెత్తురు, లేదా
వారు దనుం గొలిచి నిలిచి వర్తింతు రిలన్ ॥ 24

చం॥ తనకును వైరికిన్ సమతఁ దాల్చిన చుట్టపుఁ బంకవారి నే
యనువుననైనఁ గూర్చుకొని యందఱి నిం దనవారిఁ జేసి తాఁ
జను నటులైన చుట్టములె చాల నలంచిన యట్టి శత్రునిన్
జనపతి దా జయించుటకుఁ జాలఁగ శక్తుఁ డగున్ సుఖస్థితిన్ ॥

ఆ॥వె॥ కారణములచేతఁ గాదె లోకులు శత్రు
లగుచు నున్కి మిత్రు లగుచు నున్కి
నటులు గాన శత్రు లయ్యెడికారణం
ములను విడుపవలయుఁ బుధమితేఁడు ॥ 26

కం॥ దొర తాఁ బ్రధాన మిగుచున్
ధరఁగలిగిన ప్రజలనెల్లఁ దనవారలుగా
బరగింపందగు నటుపతెఁ
బరగిన సర్వాంగరాజ్యపదవిం జెందున్ ॥ 27

ఉ॥ దూరమునందె యుండి పరదుర్గనివాసుల పండపేశులన్
గూరిమిఁ జూపి మిత్రులుగఁ గూర్చుకొనందగు నల్లనేర్చినన్
వారలు ప్రాణబంధువులు వశ్యులునై వినయంబు పెంపునన్
దారె యొనర్పుచుండుదురు తక్కిన మండలముల్ వశంబుగన్ ॥

చం॥ పటుబలుఁడైన మధ్యముఁడు పైఁదగ దండొస గూడి వచ్చినన్
గుటిలత మాని తాను నరికూటువఁ గూడుచునుండు టొప్పుఁ దా
నటుపలె శక్తుఁడై నిలుచునంతటి పూనిక నూనకుండుచోఁ
దటుకున సంధిసేయఁదగు దానవిధాన విదానలీలలన్ ॥ 29

గీ॥ అధికుఁడైన యుదాసీనుఁ డదరినపుడు
సకలమండలనాధులు నొకటి యగుచు
సంఘధర్మంబుమై నుండఁ జనునపుడును
బలిమిలేకున్న శరణొంది బ్రతుకవలయు ॥ 30

సంఘధర్మ స్వరూపము

కం॥ ఘనముగ నాపద లొదవిన
జనపతు లందఱును గూడి స్వార్థముకొఱకై
యొనఁగూడి యవి యదంచుట
యనుపమగతి సంఘధర్మ మనఁగాఁ బరఁగున్ ॥ 31

శత్రుమండలమును గుఱించిన వైశేషికవర్తనప్రకారము

కం॥ సహజుఁడు కార్యజుఁడనగా
మహి నిరువురె శత్రులరయ మానవపతికిన్
సహజుఁడు దాయాదుండౌ
సహితుఁడు కార్యజుఁడు వాని యన్యుండెంచున్ ॥ 32

గీ॥ అరియెడఁ జరింపవలసిన యట్టి నడక
లయ్యె నాలుగు నుచ్ఛేద మపచయంబు
గాలమునఁ జేయు పీడన కర్శనంబు
లనుచు నయవిద్య లెఱుఁగువారండ్రు ధరను ॥ 33

వ॥ అదియె ట్లనిన. 34

సీ॥ ప్రకృతుల నన్నింటిఁ బరిమార్చుట దలంప
నదియుఁ దా నుచ్ఛేద మనఁగఁ బరగు
బలిమి భండారంబు గలిమి రిత్తఁగఁ జేయు
నదియుఁ దా నపచయం బనఁగఁ బరగు
నరవి మహామాత్యసంహార మొనరింప
నది కర్శనం బని యనఁగఁ బరగు
దుర్గరాష్ట్రాదులఁ దొడరి ఖండించుట
యది పీడనం బని యనఁగఁ బరగు

గీ॥ నట్టి నాలుగు తెఱఁగులు నెఱిఁగి యరుల
యందుఁ గావింప నేర్చిన యట్టి ఘనుఁడు
సకల ధాత్రీతలంబును బ్రకట లీల
నేలు వైరుల నెల్ల జయించి మించు॥ 85

గీ॥ ఆశ్రయవిహీనుఁడై యుండి యదరెనేని
హీనబలుఁ డగుపతి నాశ్రయించెనేని
యెంతొ బలువురితో వైర మందెనేని
యపుడు భూపతి గడి శత్రు నడపవలయు॥ 86

చ॥ ఎంత సమాశ్రయం బనుచు నెంతురు దుర్గము మిత్రు నెంతోఁ
దెంది మహాభిమానమును జెందిన శత్రుని వేళయందె వే
బిందగఁ జేయఁగాఁ దలయు నాతనిఁ గొల్చు నమాత్యుఁ బంపియుం
గ్రందిగ రాష్ట్ర దుర్గముల రాయిడిచేఁ గడుఁ బీడసేయుమీ॥

కం॥ తనమర్మము తన ఛిద్రము
దన విక్రమ మెఱిఁగి చెఱుచుఁ దనవాఁడనుచున్
ననరిన శత్రువు లోపల
మునికొంటినయగ్ని యడ్డు మాక్రుంపోలెన్॥ 88

ఉ॥ మాటికి సర్వతంత్రముల మర్మముఁ దెల్పెడువాఁడు గల్గ నె
చ్చోటను శాత్రవుం డసుమఁ జొప్పడుఁ దొల్లి రఘూద్వహుండు వా
మేటి విభీషణుండు సలమిత్రసుతుండును గల్గఁ బట్టి యె
ప్పాటును లేక రావణునిఁ బట్టి వధింపఁడె వాలిఁ ద్రుంపఁడే॥ 39

సీ॥ బలవంతుతోఁ దుతఁ గలహింపుచును దన
యరి ప్రయాసంబున నంది నష్ట
చిత్తనిభండారంబు నతనిబలంబులఁ
జెఱుపఁగాఁ దగుఁ దనుఁ జెఱుపఁటంచు
నొకశాత్రవునిఁ బట్టి పెకలించి పైపై
నొక బలవద్వైరి యొదవెనేని
మునుపటి పగఱనే తనవానిఁగాఁ జేసి
కొని నేర్పుతోఁ గూడికొనఁగవలయు

గీ॥ కులమువారల తోడుతఁ గూడి బలియు
చందఁ గొని యుండువైరి నాతని కులంబు
వాని కొకశత్రుఁ గల్పించి వాని మిగులఁ
బెంపు సేయుచు విభుఁ దరి నొంపవలయు॥ 40

సీ॥ విసముచేతనె యొందు విసము నాశము నొందు
వజ్రంబుచేఁ దెగు వజ్ర మెపుడు
మీలు మీలనుబట్టి మ్రింగుచు నుండును
గిరియును గరిచేతఁ గట్టుపడును
దాయాదియును దన దాయాదిచేఁ జెడు
నటుగాన రావణు నడచు నప్పు
డల విభీషణుఁ బూజ నందించి పట్టె శ్రీ
రామచంద్రుండు గౌరవము జయము

గీ॥ అట్టి నయరీతి నెంతయు నెఱిఁగి నృపతి
వైరిఁ జెఱపెడికొఱకునై వైరికులజుఁ
డైనవానినె పట్టి తా నాప్తుఁ జేసి
కొనుచు మెలపున జయముఁ గైకొనఁగవలయు ॥ 41

కం॥ ఏకార్యముఁ జేయంగాఁ
జేకొనఁ దిన మండలంబె చెడుపా టగుఁ దా
నాకార్య ముడుగవలయుఁ
గైకొన్న ధరాతలంబుఁ గడు రంజిల్లన్ ॥ 42

కం॥ దానమున సామమున స
న్మానమున న్మెలఁగఁ జేయఁదగుఁ దినవారిం
బూనుకొని భేదదండవి
ధానమ్ములచేతఁ బడులఁ దండింపఁ దగున్ ॥ 43

వ॥ ఇది శత్రుమండలవర్తనప్రకారం బింక మిత్రమండలవర్తన
ప్రకారంబు వివరించెద. 44

మిత్రమండల వర్తన ప్రకారము

కం॥ మిత్రములు హితాహితులలో
నము లిందుచు నుందు సములు గలరే యిది ని
క్కము పో 'సర్వస్స్వార్థం
సమీహతే' యనఁగఁ బరగు శాస్త్రముల్మిన్ ॥ 45

గీ॥ భోగమునంది వికారంబుఁ బొందెనేని
యెంచి మట్టంబునైన నొప్పించవలయు
మిగులఁగ వికార మొందినఁ దెగి వధింప
వలయు నిలఁ బాపకర్ముండు వైరి గాన ॥ 46

కం॥ మిగుల నుపకారియైనను
బగవాని మిత్రుఁగాఁగఁ బాటింపఁ దగున్
మిగుల నపకారియైనను
దగఁ జుట్టమునైన విడువఁ దగు జనపతికిన్ ॥ 47

కం॥ తనయెడఁ దనశత్రునియెడ
ననిశంబును బక్షపాతియై మెలఁగెడు మి
త్రునిఁ గూల్పవలయు నింద్రుఁడుః
కినుకన్ మును విశ్వరూపుఁ గెడపిన మాడ్కిన్ ॥ 48

గీ॥ అహితునకు హిత మొనరించునట్టి మిత్రు
నైన విడువంగఁ దగుఁ దన యహితుమాడ్కి
హితుల పట్టున నెవ్వాఁడు హితము సేయు
వాఁడెపో మంచిమిత్రుఁ డివ్వసుధలోన ॥ 49

కం॥ అనురక్తుండు విరక్తుఁడు
ననపల దుపకారకారి యగుమిత్రునిఁ దా
ననుపుగఁ దెలియుచు దోషం
బునఁ జెందినమిత్రు విడువ భూపతి చనున్ ॥ 50

కం॥ కడుదొసఁ గొందని మిత్రుని
విడిచినచో సర్వధర్మవితతియు సడఁగున్
బుడమిం గావునఁ బతి యె
ప్పుడు సద్గుణములను దోషములఁ దెలియఁ దగున్ ॥ 51

కం॥ తాన నిజంబుగ నేరమిఁ
గానక మఱియాజ్ఞసేయఁగాఁ దగ దేరిం
దానే నేరమిఁ దెలిసిన
చో నుచితపు టాజ్ఞచేతఁ జొప్పడఁ బతికిన్ ॥ 52

కం॥ నేరము లేవియుఁ జొరయని
వారిని దండించునట్టివసుధావిభుసం
గ్రూర మగుపాముఁ జూచిన
తీరునఁ బ్రజలెల్లఁ జూచి తిట్టుదు రెపుడున్ ॥ 53

కం॥ తగ నధికమధ్యమాధమ
జగుమిత్రులతారతమ్య మరయుఁగ వలయున్
దగ నధికమధ్యమాధమ
జగువారలపనియుఁ దెలియవలె నధిపతికిన్ ॥ 54

గీ॥ తెలియ కెవ్వరినైన నిందింపరాదు
లేనినిందలు గట్టెడువానిపలుకు
వగిలి వినరాదు మిత్రభేదములు వూను
సేయువారలఁ జతి చేరనీయరాదు ॥ 55

కం॥ పాటించి తెలుప నోపని
మాటయు మచ్చరపుమాట మధ్యస్థంబౌ
మాటయును బక్షపాతపు
మాటయుఁ జతి తెన్నుఁ దెలిసి మతి సేయఁదగున్ ॥ 56

కం॥ తనచుట్టములకుఁ జోరాం
కినసొక్కనిఁ బట్టి వాదు తెలుపక వేగం
బున వారలలో వారికిఁ
గినుకలు మాన్పంగవలయు క్షితిపతి యెందున్ ॥ 57

ఉ॥ కాలముపేర్మిఁ దా ఘనము గౌరవ మొందుచు నుండుఁ గానఁ ద
త్కాల మెఱుంగురాజు గుణకల్పన కొంత ఘటించి నీచునిన్
జాలఁగ సంస్తుతింపఁ దగు సారెకు నాతని దుర్గుణంబు తె
వ్వేళను గప్పి పెట్టుచు వివేకవిలోకనచాతురీగతిన్ ॥ 58

కం॥ తనవారిని బెఱవారిని
దనవారినె చేసికొనఁగఁ దగు జనపతి యెం
దును దా బహుమిత్రుం డై
నను వైరులు సెప్పినట్లు నడతురు పుడమిన్ ॥ 59

కం॥ తన కాపద యగువేళను
దనమిత్రుండైన కరణిఁ దన బంధువులుం
దనతండ్రియుఁ దన యన్నలు
దనతమ్ములు హితముఁ జేయఁ దా రోపుదురే ॥ 60

కం॥ క్షితిలోపల నతులదృఢ
వ్రతులై తగుతనదుమిత్రవర్గముచేతన్
బ్రతివీరు లైనవారలఁ
జతురతమై నిగ్రహింప జనపతి యోపున్ ॥ 61

మ॥ ఇల నీరీతుల నీతిమార్గమునఁ దా నేప్రొద్దువర్తించి నిః
స్ఖలితోద్యోగమునన్ జయేచ్ఛ గలరాజన్యుండు పెంపొందు మం
డలశుద్ధిం దగి శుద్ధమండలమునన్ వర్తించు నాకారదో
ర్జ్వలచంద్రుం దన భూప్రజావితతికిన్ సంతోషముం జేయుచున్॥

వ॥ ఇది మండలశోధన ప్రకారంబు. ఇంక సంధ్యాది షడ్గుణంబుల
స్వరూపంబుఁ గ్రమంబున వివరించెద. 63

## సంధివికల్పప్రకరణము

కం॥ బలియుఁ దగువైరి గదిమిన
బలువగునాపదలఁ జెంది ప్రతి సేయఁగ నే
ర్పులు లేనిరాజు కాలం
బలవడఁ గడపుచును సంధి యమరించఁ దగున్ ॥ 64

వ॥ అదియు గొన్నిమతంబులవారు కపాలసంధి, యుపహారసంధి, సంతానసంధి, సంగతసంధి, యుపన్యాససంధి, ప్రతీకారసంధి, సంయోగసంధి, పురుషాంతరసంధి, యదృష్టనరసంధి, యాదిష్ట సంధి, యాత్మామిషసంధి, యుపగ్రహసంధి, పరిక్రియసంధి, యుచ్ఛిన్నసంధి, పరదూషణసంధి, స్కంధోపనేయసంధి, యనం బదునాఱు విధంబులుగాఁ బలుకుదురు. ఇవి కొన్నిమతంబుల వారు పరస్పరోపకారసంధియు, మైత్రసంధియు, సంబంధ సంధియు నుపహార సంధియు నన నాల్గు తెఱంగులే యని పల్కుచుందు రైనను నిందులో నుపహారసంధి యొక్కటియ యీ కామందక మతంబునకు సమ్మతంబు. అది యెట్లనిన నెందును ఏనమీఁది దండెత్తివచ్చిన బలవంతుం డగుశాత్రవుం డెందైన నొకటిఁ గానుకఁ గొనక మగుడి చనండు కావున మైత్రిచేనైన సంధి యొక్కటి దక్క దక్కిన సంధు లన్నియు నయ్యుపహారసంధిలోని భేదంబులే యగు నైన నీపదియాఱు సంధుల స్వరూపంబుఁ గ్రమంబున వివరించెద. 65

సీ॥ సమసంధియ కపాలసంధియై పొలుపొందు
నుపహార మీఁగిచే నొనరుచుండు
సంతానసంధి నాఁ జనుఁ గూఁతు నిచ్చినఁ
గడుమైత్రి నెనయ సంగతపుసంధి
కలకాల మది యొక్కగతిఁ బ్రవర్తింపుచు
సమకార్యములు గల్గి చాల మించి
యాపదలందును నధికసంపదలందు
భేదంబు చెందక పెంపుఁ జెంది

గీ॥ యలమనుష్యముఖాంతర మొందునై సఁ
గట్టి కొట్టుచుఁ గాఁకలం బెట్టునెడల
నది సువర్ణంబురీలచేఁ జెదరి కుండుఁ
గనుక కాంచనసంధి నా వినుతిఁ గాంచు ॥ 66

సీ॥ మంచికార్యము నిద్దఱెంచి సేయుటకునై
యదరుట యది యుపన్యాససంధి
యితనికి నుపకార మే నొనర్చితి మున్ను
నతఁడు నా కుపకార మటులఁ జేయు
నుపకార మిపుడు నే నొనరించుచున్నాఁడ
నిఁకమీఁద నా కుపకృతి యొనర్పఁ
గలఁ డీతఁడని రాముఁ డెలమి సుగ్రీవుని
కొనరించినట్లుగా నొప్పు నిదియు

గీ॥ ఎనెదు నదియును బ్రతికార మనెడిసంధి
యిరువు రొకయాత్రఁ గూర్చి తా రింపుమీఱ
సంధి సేయుట సంయోగసంధి యనఁగఁ
బరగు నీరీతు లెఱుఁగ భూపతికిఁ దగును ॥ 67

సీ॥ మనయిరువుర యోధులును గూడి మాకార్య
మిది యొనగూర్చిన నింత ధనము
మీ కిత్తుమని తాను మేకొన్నసంధి తా
నది పురుషాంతర మనెడుసంధి
మాకార్య మిది మీర చేకూర్చినను మీకు
నిట్టివస్తువులు మే మిత్తు మనిన
నది యదృష్టపురుషమనఁ దనరెడు సంధి
దేశాంశ మియ్య నాదిష్టసంధి

గీ॥ తనదు సైన్యంబుచేతనే తగ నొనర్చు
సంధి యాత్మామిషం బనుసంధి యంద్రు
ప్రాణరక్షణమునకు సర్వంబు నొసఁగి
వలసియుండుట యది యుపగ్రహ మటంద్రు ॥ 68

సీ॥ భండారమెుం దొకపా లిచ్చి యైన నం
దిచ్చుదాఁకినసొమ్ము లిచ్చియైనఁ
బలుభండార మంతయు నిచ్చియైనను
సంధించి ప్రకృతిరక్షణ మొనర్చు
నది పరిక్రయసంధి యనఁ జెలువొందును
దనభూమిమే తెంచి తనపగఱకు
నొసగూడి యిచ్చిన నుచ్ఛిన్నసంధి యౌఁ
బద్భూమి ఫల మింత ధన మటంచు

గీ॥ సహరి నిచ్చిన ఫలదూషణాఖ్యసంధి
ఫలమె విభజించి కందాయముల నొసంగ
నిర్ణయించుట స్కంధోపనేయసంధి
యట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 69

సీ॥ బాలుండు వృద్ధుండు బహుదీర్ఘరోగుండు
నిజబంధుదాయాదనిందితుండు
పిఱికి యైనయతండు పిఱికిబంటై యుండు
పిఱికిబంట్లు యతండు పిసిదివాఁడు
పరిసరాజ్యాంగుఁడు విషయసక్తుండును
బహుచిత్తమంత్రుండు బహువిరోధి
పరుషులు వ్యసనముల్ గలిగినయతఁడును
వ్యసనముల్ గలుగుసైన్యములవాఁడు

ఆ॥ దైవపహతుఁడు సత్య ధర్మహీనుఁడు లావు
విడిచినతఁడు సురల ద్విజుల నెపుడు
గడవ నాడువాఁ డకాలయోధియు నైన
చింతకుండు సంధి సేయఁ దగరు ॥ 70

వ॥ అది యెట్లనిన నిట్టియిరువది తెలంగులవారును సంధానార్హులు
గాకుండుటకుం గారణంబులు గలవు వివరించెద. 71

సీ॥ బాలుండెదురుగాఁగఁ బాలనికతమున
నని సేయఁగాఁ బూన రతనిబంట్లు
తానును నని సేయ లేనివానికి నుప
కారార్థ మెప్పుడు పోరానర్రు
ముసలివాఁడును రోగములు గల్గువాఁడు ను
త్సాహశక్తులులేమి తమజనంబు
చేతనే భంగంబుఁ జెందుడు జెందును
విరసుఁడై జ్ఞాతుల విడచినయతఁ
గీ॥ డరికిఁ గైవసమై యుండు నట్టిజ్ఞాతి
జనులచేతనె మున్నుగాఁ జంపఁబడును
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవార
లట్టివారలతో సంధి నెనయరాదు ॥ 72

సీ॥ కోఁచవాఁ డని సేయఁ గొఱఁగానికతమునఁ
దనుఁ దానె వెఱచి నాశనముఁ జెందు
నెడుఁగోఁచబంటులఁ గలధీరుఁడైన వా
బంట్లచే నాతి విప్పాటుఁ బొరయు

నరిచేత లంచంబు నంది పెచ్చుతనంపు
బంటులు పతిఁ గీడుపఱతు రెపుడు
లోభి జీతము లీయ లోఁగెడుకతమున
బంటులు మొగియరు బవరమునకు

గీ॥ విరసరాజ్యాంగుఁ డరులతోఁ దురమొనర్ప
విసివి రాజ్యాంగములు వాని విడిచి పెట్టు
విషయసక్తుని గడు సుఖవృత్తి గెలువ
వచ్చుఁ గావున వీరితో వలదు సంధి ॥ 73

సీ॥ బహువిచారంబులు బహుచిత్తములు గల్గు
పతిమంత్రులకు నెల్లఁ బగతుఁ డగుచు
పలచిత్త ముండుటవలనఁ గార్యంబుల
యెడ వారిచేతనే విడువఁ బడును
పెక్కుదేగలయందుఁ జిక్కుపావుర మసి
బహువైరి యగువాఁడు పదరి బెదరి
యెట్టిత్రోవలఁ బోవ నట్టిత్రోవలయందె
స్రుక్కి శాత్రవులచేఁ జిక్కువడును

గీ॥ కరువు వ్యసనంబులును జెంది కలఁగువాఁడు
కోలుకోలేక తనుఁ దానె కూలుచుండుఁ
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవార
లిట్టివారలతో సంధి నెనయరాదు ॥ 74

సీ॥ వ్యసనముల్ గలిగినయట్టిబలంబులు
గలవాఁడు పోటు కెక్కంగ లేఁడు
దైవోపహతకుఁడు తనుఁ దానె చెఱుచుచుండు
సత్యంబు ధర్మంబు సడలినయతఁ

దనువుగా సంధి సై కొనినమీఁదట వైరి
బెదరునుఁ దా మల్లబడి కలంగి
తలము దప్పినయట్టి దంతావళము నీటఁ
గొంచెపుమొసలిచే గుదిసినట్లు
గీ॥ నెలవు దప్పినయాతండు నలఁగి శత్రు
శాత్రవునిచేతనైనను నపయుచుండుఁ
గాన వీరెల్ల సుఖసాధ్యు లైనవార
లిట్టివారలతో సంధి నెనయరాదు ॥ 75

సీ॥ దేవుళ్ళఁ బాపలఁ దిట్టునాతఁడు ధర్మ
హీనుండు గావున నీల్గుచుండుఁ
గనుఁగొనలేక చీఁకటిలోనఁ గాకంబు
ఘూకంబుచేతను గూలినట్లు
కాల మెఱుంగక కలహించునాతండు
గాలజ్ఞయోధచేఁ గూలుచుండు
నాపదలకు మఱి యధికసంపదలకు
దైవంబె కద నిమిత్తం బటంచు
గీ॥ దైవచింతకుం డన్ని యత్నములు మాని
యూరకుండియ చెడుచుండు నుర్విలోనఁ
గాన వీరలతో సంధి గాదు తలఁప
నిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 76

సంధి కర్తు లగువారు

గీ॥ ఆర్యుఁడును ధార్మికుండు ననార్యుఁ డధిక
బలుఁడు దాయాదవర్గంబు గలుగునతఁడు
సత్యవంతుండు బహుజయశాలి సంధి
కర్తలని పల్కుచుండ్రు నయజ్ఞు లెందు ॥ 77

వ॥ అది యెట్లనిన, నిట్లు సంధానార్హులైన యేడుగురి తెఱఁగును క్రమంబున వివరించెద. 78

సీ॥ ఆర్యులై తగువారలు ప్రాణబాధలయందుఁ
దనమంచితనమె వదలకయుండు
ధార్మికుండెందును దనధర్మము విడువఁ
గడుఁ బ్రజానురాగంబు గలుగకున్న
నతఁ డెదిరించిన నతనికై యందఱు
నని మొనర్తురు కాన నతఁ డనార్యుఁ
డగు ననార్యుండైన యతఁడు గూడకయున్న
నతఁడు శత్రులఁ గూడి యడఁగఁజేయు

గీ॥ మొదలు ముట్టంగఁ బరశురాముని విధమున
నిట్టివార లసాధ్యులౌ టెఱిఁగి యందు
సంధి గావించవలయు నీతిగతిలోన
నీతిమార్గం బెఱింగిన నృపవరుండు ॥ 79

సీ॥ అధికుఁ డెంతయు నన్ను నాక్రమించినచోట
నెన్నియత్నంబుల నెనసియైన
నతఁడు దా బలుసింహ మాక్రమించినలేఁడి
లీల నెంచును దిక్కులేకయుండు
నధికుతో నేమాత్రమైనను గినిసిన
నల్పుండు మొదలంట నపుడె చెడును
బలవంతుతోడఁ గలహించుమని నీతి
శాస్త్రంబు బలుకు చెప్పఁబనులేదు

గీ॥ మొనసి పెనుగాలి కెదురని మొగిలు కరణి
నధికుతో నల్పుఁ డెదురలేఁ డటులఁగాన

ప్రతుకవలసిన భూపతి బలియుతోడ
సంధిసేయంగవలయు నిశ్చయముగాఁగ ॥ 80

ఆ॥వె॥ అధికుఁడై పర సత్రుఁడై వేళయైనచో
విక్రమించునట్టివిభునిసిరులు
చెందివెలయు గట్టుచెంతఁనమ్రుతఁజెంది
యపలఁ బ్రబలునదులయంద మొంది ॥ 81

సీ॥ దాయాదవర్గంబు దనకుగల్గినవాఁడు
కడుమూఁకఁజెంచెన కారణమున
భేదింపరాకుండుఁ బెనుముండ్లు బలసిన
వెదురులపొదలోని వెదురుమాడ్కి
సత్యవంతుఁడు దన సత్యంబు నడుపుచు
సంధికృత్యంబుల జారకుండు
గెలుపుచెయ్యేదఁ బెక్కుగలవాఁడు వీరకైనా
పరశురామునిఁ బ్రతాపమునఁ బోలి

గీ॥ యతనిశౌర్యంబుచేతనే యఖిలదిశల
మించుభూపతులెల్లఁగంపించియుండు
రట్టివార లసాధ్యులౌ టెఱిఁగి విభుఁడు
సంధిసేయంగవలయు నీజగతిలోన ॥ 82

కం॥ పెక్కు జయంబులు గల దొర
నొక్కటిగా సంధిగూడు నుర్వీ విభునిం
దిక్కని గొల్తురు వైరులు
చక్కనగాఁ దత్ప్రతాప సంతాపితులై ॥ 83

ఆ॥వె॥ సంధియయ్యెననుచు సత్యవంతులనైన
నమ్మియుండఁ జనదునరవరునకుఁ

చేయరానిపాసనేసియు నింద్రుండు
వృత్రుఁ జంపినట్టి విధమెఱింగి ॥ 84

ఆ॥వె॥ తనయుఁడైన నమ్రుఁగు దండ్రియైనను రాజ్య
మంది యొకనిఁజార మొందుఁ గాన
లోకజనముచర్యలోనిది గాకుండ
ధరణిపతులనడకఁ దలఁప వలయు ॥ 85

క॥ బలవంతుఁ డెత్తివచ్చిన
నలుకక దుర్గమున నిల్చి యుంతటికంటెన్
బలవంతుఁ దెచ్చి తఱుమఁగ
వలయుఁ బటాపంచముగ నవారితశక్తిన్ ॥ 86

వ॥ మఱియు భరద్వాజమతంబున. 87

క॥ తనయుత్సాహము బలిమియుఁ
గనుఁగొని యరిమీఁద నెత్తికె కలహింపఁ దగున్
ఘనసింహ మెదిరి పిదకటు
లను వెంటాడంగఁ జాసులాగున నెంచున్ ॥ 88

క॥ ఉచటుగల సింహ మొక్కటి
పదగల సంఘములఁ గెల్చుమాడ్కిఁ బగఱపైఁ
బొదలిన తనయుత్సాహము
నుదుటుం గని గమకమునను బుఱుడఁగవలయున్ ॥ 89

క॥ కడునల్పసైన్యనైనను
బడలికఁబడి యొక్కశత్రు భంజించినచోఁ
బొదవైనతత్ప్రతాపము
కడిమినె ఖిల నితరశత్రుగణముం బొగడున్ ॥ 90

కం॥ సముతోడ నైనసంధియు
నమరుం గెలుపోటమియును ననిలో సందే
హముగన నిట్లనె పలుకఁడె
యమరగురుఁడు నిశ్చితార్థ మది కాదంచున్ ॥ 91

చం॥ బలియుఁగఁ గోరురాజు తనబల్మికి మున్ను సమానవైరితోఁ
జలమునఁబోరఁగాఁ జనకసంధియె చేయుట మేలు కానిచో
నలవడఁ బచ్చికుండ మెరయంబడి రెంటఁగవ్రీలుకైవడిన్
బొలియుటె కాక గెల్పులను బొందుట లెందును జెందనేర్చునే॥

ఆ॥వె॥ సముల మనుచు బదరి సంధిసేయక మీఱి
పోరి యిరువురొకట బొలియరైరె
పంచరైనయట్టి సుందోపసుందులు
గాన సములు సంధిఁ బూన మేలు ॥ 93

ఆ॥వె॥ తనకు న్యూనమైనతటి హీనుఁడైన
సంధిసేయఁ దేని చాలఁగీడు
చలిసిస్టివానియొడలిపై నొకమంచు
బొట్టుబడిన వడఁకు పుట్టకున్నె ॥ 94

కం॥ హీనుఁడగు వైరి యెడలం
దా నెంతయు న్యూన మెదలుతటి సంశయము
న్మానుచు నిర్దయుఁడై పతి
వానియవిశ్వాస మెఱిఁగి వధియింపఁదగున్॥ 95

సీ॥ అరి కడుబలవంతుఁడైన సంధియుఁ జేసి
చేరి విశ్వాసంబుఁ జెంద నడచి
తాను నమిత్రునయట్టివానికై వడి సుంది
తనయింగితాకృతుల్ గనఁగనీక

తనుప్రియంబులె పల్కఁ దనదుశౌర్యము తన
కనువైనవేళ సేయంగ వలయు
నదియటులన్న నట్లనుసరింపుచుఁ దొల్లి
విశ్వాస మందించి వేళయెఱిఁగి

గీ॥ ఘనుఁడు దేవేంద్రుఁడుం దితి కడుపుఁజొచ్చి
కడుపులోనున్న పగఆ ద్రక్కఁగాఁ జీటి
యల మహద్గణకర్తయై యతిశయిల్లె
నిట్టిమార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 96

సీ॥ బలవంతుఁడగురాజు చలముసఁబైనెత్త
నాతనియువరాజు నతనిమంత్రి
తోనైనఁ దాను సంధానంబు గావించి
వారిలో వారికిఁ బోరుఁబెట్టి
యదియును గాకున్న నతనిప్రధానున
కెంతయుఁ దా ధనమిచ్చియైన
వలయు నర్థముల లేఖల నిచ్చి యైనను
బరునియత్నంబులు నెఱుపవలయు

గీ॥ నిన్నిరీతులఁగార్యంబు లెసఁగకుండఁ
జేయఁ గడుసుగ్రుఁడై వైరిచెంతనుండు
వారిపైనెల్లను గడువిశ్వాస మొంది
యతఁడు సేసిన యత్నంబు లతఁడెమాను ॥ 97

కం॥ అరియత్నము లుడుపఁగఁ బగు
నరిమిత్రుల సంధిచేసియైనను లేదా
యరిపైద్యుల భేదింపుచు
నరిఁ జెఱుపఁగవలయు రసవిషాదులనైనా ॥ 98

వ॥ ఇట్టి యత్నంబులు చేసినను బెట్టిదుండగునట్టిపగఱ మట్టుపడక
యిట్లు గదిమినయేని యెంచియు, 99

సీ॥ బహువేషభాషలఁ బరగినవారలై
యాభిచారికనిమిత్తాదు లెఱిఁగి
యాశత్రుదేశంబు నందె కాపుర ముండి
సంచరించెడుఁ దనచరులచేత
నొకకొన్ని ప్రశ్నలు నొకకొన్ని శకునముల్
కడు నిదర్శనములుగాఁ జెలుపఁ
జేసి శత్రుల విశ్వసింపఁ గావింపుచు
వారిచేతనె బహువ్యసనములును

గీ॥ భీకరోత్పాతములును గల్పింపఁజేసి
యిట్లు శత్రునియుత్సాహమెల్లఁ జెఱచి
వానిఁ దోఁ దోలవలయు నివార్యమహిమ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు॥ 100

గీ॥ పుత్రమిత్రకళత్రాప్తపశుధనాది
వాహనాదులు నిదసంబుపలసి యొక్క
నిమిషమున వ్యర్థమగుట లో నృపతి యెఱిఁగి
మిగులఁ గలహంబులకుఁ బూని మెలఁగరాదు॥ 101

కం॥ బలమును ధనమును జుట్టం
బులు నిజదేహంబు రాజ్యమునఁగీర్తితతుల్
దలఁకుచు సంశయదోలా
కలితముగాఁగనె వివేకి కదనమొనర్చున్॥ 102

సీ॥ తనసరిదొరయైనఁ దనమీఁద నెండెత్తి
తనతోడ సంధిగై కొనకయున్నఁ
దా నటమీఁద నాతనితోడ సంధి గా
వలసినవాఁడయై వైర ముడిగి

కాలోచితంబైన క్రమమున సామదా
నంబులచేత భేదంబుచేత
నటు మట్టుఁ గడనుండి యామీఁదఁ దా మించి
యరి కసాధ్యంబైనయచట నిలిచి

గీ॥ చతురగతిఁ దొల్చి సన్నాహసహితసైన్య
పటలిచేతను జీకాకుపఱుపవలయు
నతఁడెటులఁ దప్పుఁడైకూడ నటుల విఘుఁడు
'తప్తయోస్సంధి' యనెడి శాస్త్రంబెఱుఁగి॥ 103

కం॥ ఈరీతి సంధికార్యము
దారయ వచింపుమరు మునులు తత్సంధి బలా
త్కారమునసైనఁ గార్యము
గౌరవలాఘవము లెఱిఁగి కావింపఁదగున్ ॥ 104

వ॥ ఇది సంధిస్వరూపంబు. ఇంక విగ్రహస్వరూపంబు వివరించెద.

విగ్రహ వికల్ప ప్రకరణము

కం॥ తమలోఁ దా రెప్పుడు కో
పముల నసూయలను బెరసి పంపుమిచు నపకా
రములె యొనరించుటలచే
నమరంగాఁ దొడము విగ్రహము మహిలోనన్ ॥ 106

ఆ॥వె॥ ఫలముగోరువాఁడు పగవారిచేతను
వెతలఁ జెందువాఁడు చతురుఁడగుచు
నహితుతోడ విగ్రహము సేయవలయును
బలము దేశకాలబల మెఱింగి ॥ 107

వ॥ ఇట్టి విగ్రహంబు స్థానాపహారంబువలనను రాజ్యాపహారంబు
వలనను, వనితాపహారంబువలనను, గ్రామాపహారంబువలనను,

సర్థవిఘాతంబువలన..., ధర్మవిఘాతంబువలనను, జ్ఞానాప హారంబువలనను, జ్ఞానశ క్తివిఘాతంబువలనను, మిత్రార్థంబు వలనను, నవమానంబువలనను, నభిమానంబువలనను, బంధు నాశనంబువలనను, నేకార్థప్రీతివలనను, ధనాపహారణంబువలనను, గృతానుగ్రహభేదంబువలనను, దైవంబువలనను, బ్రకృతి క్షోభంబువలనను, దేశపీడనంబువలనను, బహుజనద్వేషంబు వలనను, గలుగుచునుండు నిందుకు శమనప్రకారంబెట్లన్నను గ్రమంబున వివరించెద. 108

సీ॥ స్థానరాజ్యములకు సతులకు మఱియు దే
        శములకుఁ గా వచ్చు జగడమెల్ల
పుచ్చుకొన్నవి మళ్ళ నిచ్చుటచే నొరుల్
        గైకొన్నదియు మతిఁ గనుటచేత
నర్థంబు ధర్మంబు నడపఁబో రాదవఁదొ
        లఁటియప్ప యిచ్చి యేర్పుటలచేత
జ్ఞానాపహారంబు జ్ఞానశక్తివిఘాత
        ముల నైన జగడంబు చలము కొనక
గీ॥ పట్టునర్థంబు వదలి చొప్పటుటచేతఁ
దనకొనర్చు నుపేక్షచేఁ దాల్మిచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ దెలంగ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 109

సీ॥ ద్రోహంబు ధర్మంబులతోఁ గూడుమిత్రుని
        కలహంబుఁ దనయుపేక్షణముచేత
నెనసినమంచిమిత్రునికై నజగడంబుఁ
        దనదిగా వహియించుకొనుటచేత

అపమానమునఁ గల్గు నావిగ్రహం బను
నయముతోఁ గూడు యానంబుచేత
అభిమానమునఁ బుట్టినట్టి వైరంబు సా
మంబుచేతను బ్రణామంబుచేత

గీ॥ బంధునాశంబువలనఁ జొప్పడినపోరు
దగిన యట్టి రహస్యవర్తనముచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ దెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 110

సీ॥ ఏకార్థమునకుఁగా నిరువుర కగుపోరు
తనకోర్కి వదలి యీడ్కొనుటచేత
ధనముఁ గైకొనుటచే నొనరినజగడంబు
క్రోధంబుఁ జాలించుకొనుటచేత
నదరి చేయు ననుగ్రహము మాన నగుపోరు
మగుడి యనుగ్రహమహిమచేత
దైవికగతిచేతఁ దనకైనజగడంబు
దైవంబు గూర్పుయత్నంబుచేత

గీ॥ మండలక్షోభమున నైన మచ్చరంబు
నందుకొనఁగూడి తగునుపాయములచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ దెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 111

సీ॥ మించి దేశంబు బాధించఁగా నైనపో
రతనిదేశముఁ గూల్చునందుచేత
బహుజనంబులతోడఁ బరగినజగడంబుఁ
దగుసామదానభేదములచేత

మానుపఁగావలె మఱి యిట్లు పొడమెడి
కలహముల్ దా మాన్పఁగడఁగఁడేని
సర్వంబు నొకవేళఁ జాల నాశనమొందుఁ
గావునఁ గడు విచక్షణత మించి

గీ॥ యేయుపాయంబుచేఁ బీడ యెసఁగకుండ
నాయుపాయంబుచే విగ్రహంబు లెల్ల
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ దెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 112

వ॥ మఱియుఁ గొన్నిమతంబులవారు శత్రుప్రవర్తనమువలనను, గ్రహంబులవలనను, వనితలవలనను, వాగ్దోషంబువలనను, నపరాధంబువలనను, బుట్టెడి వైరంబు లైదువిధంబులే యని పల్కుచుండుదురు. బాహుదంతితనూజుండు భూమియోఁ లద్దగించుటవలనను, భూమిబాధ గలుగుటవలనను. శక్తి చెఱుచుటవలనను, గడిరాజువలననుం బొడమెడి వైరంబు లాయిదువిధంబులే యని పలుకుచుండు. మనుమతంబువారు కులమువలనను నపరాధంబువలననుం బొడమెడి వైరంబులు రెండువిధంబులేయనియును బలుకుచుండుదు రైన నందుఁ బూన రాని విగ్రహంబులు పదియాఱువిధంబులు గల వవి యెట్లనిన.

సీ॥ అల్పఫలంబై నయది నిష్ఫలంబును
ఫలము నిశ్చయలీలఁ బరగునదియు
నపుడు దోషముగల్గి యామీఁద ఫలమిచ్చు
నదియును దోషంబు లపుడులేక
యటమీఁద ఫలయుక్తి నలరకుండెడునది
యపుడు మీఁదట దోష మందునదియుఁ
దా నెఱుంగనిశూరతను మించువానిది
పరులు ప్రేరేపఁ జొప్పడునదియును

గీ॥ నొరుల కొఱకై నయదియును దెఱవకొఱకుఁ
గాఁగవచ్చినయది దీర్ఘకాలముదియు
నై నవిగ్రహముల నెల్ల మానవులయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 114

సీ॥ బ్రాహ్మణోత్తములతోఁ బరగిన నదియును
వేళ గాకుండెడివేళ నెందు
దైవబలంబుచేఁ దగువానితోడిది
కలహంబునకె నిచ్చఁ గాలు ద్రవ్వ
నెరికాండ్రు గల్గినక్షితిపతితోడిది
తత్కాలఫలయుక్తిఁ దగుచునుండి
యామీఁద నిష్ఫలమైవచ్చునదియును
తత్కాలఫలయుక్తిఁ దగులనీక

గీ॥ యంతమీఁదట ఫలయుక్తి నమరునదియు
ననఁగఁ దగినట్టి పైపదియాఱు తెఱఁగు
లై నవిగ్రహముల నెల్ల మానవులయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 115

గీ॥ చేయునప్పుడు మీఁదటఁజేటులేని
విగ్రహమ్మున యెపుడుఁగావింపవలయు
నవియు కా వన్నిపనులందు నటులఁగాఁగఁ
దలఁచి మెలఁగంగవలయు నిచ్చలు విభుండు ॥ 116

ఉ॥ అప్పుడు మీఁదటన్ ఫలము నందఁగఁ జేయువిశుద్ధకర్మముం
దప్పక యాచరించుజననాథుఁడు నిందలఁ జెందకుండుఁ దా
నెప్పుడు నట్టికాపున మహీస్థలిలో నిహముం బరంబుఁ దాఁ
జొప్పడఁ గూర్చునట్టిపని సొంపునఁజేయఁగ నొప్పుఁ బ్రాజ్ఞుఁడై ॥

చ॥ ఒకయిసుమంతయర్థమునసుందెఱుఁ గోభముచేఁ బరంబుఁ బెం
పక దిగ నాడఁగావలదు తత్పరలోకవిరుద్ధకర్మలం
బ్రకటముగాఁగ దవ్వులనె పాయుట మేలగు నిట్టి లాగము
ప్రకరము వల్కుఁగావున నృపాలుఁడు సత్క్రియఁజేయుచేతగుఁ

సీ॥ బలము పోషణ మంది చెలఁగియుండెడివేళ
నమరక్తిమై ప్రజల్ దనరువేళఁ
దాను జూచినచూపు దైవ మీడేర్చుచోఁ
దనమిత్రు లతిభక్తిఁ దనరువేళ
సకలసామంతులు సంధిఁగోరెడివేళ
నాప్తమంత్రులు గలయట్టివేళ
ధనధాన్యములు చాలఁ దన కొనఁగూడుచో
నుత్సాహ మాత్మలో నుబ్బువేళఁ

గీ॥ బరుల కిటుపంటి వెల్లఁజొప్పదనియట్టి
వేళ నొనరింపఁగాఁదగు విగ్రహంబు
ధనము మిత్రుండు భూమి నాఁ దగినమూఁడు
గతులఫలముల నొకటైనఁ గలుగఁదెలిసి॥ 118

ఉ॥ మేలు ధనంబు ధాత్రిపయి ముంచుసువస్తులకన్న నంతకుఁ
మేలు దలంప మిత్రుఁ దలమిత్రునికంటెను భూమి మేలగుఁ
మేలగుభూమిచేతఁ గరుమేలగు సంపద గల్గు సంపదఁ
జాలఁగ బంధుమిత్రులును సద్గుణజాలము గల్గు నెప్పుడుఁ॥

కం॥ తనతో సమసంపదచే
నెనువొందెడిశత్రుజనుల నప్రతిహతమై
తనరుసుపాయముచేతనె
జనపతి శిక్షింపవలయుఁ జతురుం డగుచుఁ॥ 121

కం॥ కలహాంబైన సుపాయ
మ్ములచేతనె తాళి శాంతిఁబొందింపఁదగున్
గెలుపులు దలఁప ననిశ్చయ
ములు గావునఁ ద్వరితగతుల మొనయకి నృపతుల్ ॥ 122

మ॥ బలవంతుండగు శాత్రవుండు గినుకన్ బైవచ్చి పోథించినన్
గలఁగన్ బాలక నిత్యసంపదల నాకాంక్షించుచున్ బుద్ధిని
శ్చలతన్ వైతసవృత్తిచే వినతుఁడై శత్రుం బ్రసన్నాత్ముఁగా
నలరింపందగు సర్పవృత్తు లటు పాయంబెట్టి నేర్పొందుగన్ ॥

ఆ॥వె॥ పామురీతిఁ గ్రూరభంగిఁ జరించిన
విభుఁడు నాశ మందు వేగ జగతి
సిరులఁ జెందుచుండుఁ దిరముగాఁ బ్రబ్బళ్ళ
లీల వినయవృత్తి వాలునతఁడు ॥ 124

ఆ॥వె॥ మత్తురీతి వెత్తిమార్గ్యుఁ దా నూరక
యుండివేళఁబైకి నుఱికి సింహ
మటులఁ గ్రమముచేత నందినయది జాల
కుండఁబట్టి విజయ మొందవలయు ॥ 125

సీ॥ తాఁబేటిలీల యెంతయును ముడుంచుక
తనమీఁదవచ్చు బాధలకుఁదాఁ
గట్టుకై యవకి నిల్చి కదలక యోర్చుచు
ననువుగాకుండెడియట్టివేళ
యరిని మూపునఁబెట్టియైన మోవఁగనేర్చి
ప్రియభాషణంబులఁ దేలుపఱచి
కడుఁబ్రసన్నాత్ముఁడై పుడమివార్త లెఱింగి
యరియంతరంగంబునందు నిల్చి

ఆ॥వె॥ సమయమెఱుఁగి కృష్ణసర్పంబుగతిఁ జిక్కు
మనుచు నొడిసి యగ్నియటుల భగ్గు
రనఁగ నెగసి నీతియనుచేత ముందలఁ
బట్టి తివియవలయుఁ బరులసిరుల ॥ 126

చం॥ నిలుకడఁగాంచి మేలెఱుఁగునేర్పు వహించి పరాక్రమంబునన్
గులమున మించి సత్యమొనఁగూడఁగ ధైర్యదయాతిదానస
త్కళల వరించి యార్జితుఁడు గౌరవశాలియునైనరాజు నీ
చ్చలు నిలశత్రురాజుల కసాధ్యుఁడగున్ మదినెంచిచూడఁగన్ ॥

ఉ॥ వరుసముఁబల్కి మేల్మఱచి బాసలుదప్పి భయంబుఁజెందుచున్
గరువము దుఃఖమోపమియుఁ గల్గి ప్రమాదము జాప్యచందమున్
విరసముఁజెంది జూదముల వేఁటల నింతులఁ బానలీలలన్
నిరతము నాచరించు నవినీతుఁడు సంపదఁజెందనేర్చునే ॥ 128

ఉ॥ గెలువఁగఁ గోరునట్టి దొర కీడుగుణంబులు గల్గుశత్రుపై
నలవుమెయిం ద్రిశక్తియుతుఁడై చనఁగాఁదగు నట్లుగాక ని
శ్చలగుణశాలియై తనరుశత్రుని మీఁదట నెత్తువాఁడు నే
ర్పులఁదనుదానె చంపుకొనఁ బూనుచునుండును నిందకర్హుఁడై ॥

చం॥ ఘనమగు రాజ్యసంపదలు గైకొను నిచ్ఛఁజెలంగి బుద్ధిచే
ననువగుమండలక్రియలనన్ని యెఱింగి దృఢప్రయత్నుఁడై
పనివడి విగ్రహస్థితులఁ బాగుఁజెందుచుఁ గార్యసిద్ధికై
యనిశముఁ బూనఁగావలయు నద్భుతశౌర్యసమగ్రచర్యలన్ ॥

వ॥ ఇదియు విగ్రహస్వరూపంబు. ఇంక యానప్రకారంబెట్లనిన.

## యానప్రకరణము

గీ॥ అధికబలవిక్రమంబుల నలరి ప్రకృతు
లాత్మగుణముల ననురక్తి నంది కొలువ
విజయమందుట కలమహీవిభుఁడు రిపుల
నడఁచుటకు దండువెడలుట యానమండ్రు ॥ 132

వ॥ అదియును విగృహ్యయానంబును, సంధాయయానంబును, ప్రసంగయానంబును సంభూయయానంబును, నుపేక్ష యానంబు ననియైదు తెఱంగులయ్యె వానిస్వరూపంబులు క్రమం బున వివరించెద. 133

సీ॥ బలవంతుఁడరిప్రధానుల నిగ్రహించి దం
డెత్తుటయును దనహితులచేత
నరిమిత్రులను నొంచి యరిమీఁద దండెత్తు
నదియును విగ్రహయానమండ్రు
వెనుక శత్రులసంధి నొనరి యన్యుల మీఁది
నరుగుటయును ఏను నడ్డకట్టు
విమతులు సంధించి వేఱొక్క యరిమీఁది
నరుగుట సంధాయయాన మందు

గీ॥ రొక్కచోటికిఁ గదలి వేఱొక్కయెడకు
శల్యరీతిఁ బ్రసంగవశంబు కతనఁ
జనినయది ధాత్రియందుఁ బ్రసంగయాన
మండ్రు నయశాస్త్రవిదులైన యార్యు లెందు ॥ 134

సీ॥ శౌర్యశక్తులమించి చాల మూఁకలగూల్పఁ
గలిగిన సామంతగణము తోడఁ
గలసి శాత్రవులను గదుమ నుద్యోగించి
కదలిపోవుట చూడ నదియుఁగాక
ఫలమిత్తునని ప్రతినలు వల్కి కొంచెపు
దొరలతోఁ గూడుక యరుగునదియుఁ
దమప్రకృతుల నొంపఁ దా రిరువురు గూడి
యిరువురు శత్రుల నే పడంప

గీ॥ మునుపు సూర్యాంజనేయులు సనినరీతి
నరుగుటఁ దలంప సంభూయయాన మండ్రు
రిట్టి యానప్రకారంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 135

సీ॥ శత్రుపై దండెత్తి చనుచోట నహితున
కపుడు సహాయుఁడై యతనికంటె
బలవంతుఁడగురాజు పైనెత్తివచ్చిన
మునుపటిశత్రుపైఁ జనక తాను
వాని నుపేక్షించి వానిసహాయుపైఁ
జన నుపేక్షయాన మనఁగఁ బరగు
వాసవసూతి నివాతకవచులపైఁ
జని యుపేక్షయానమునసె తొల్లి

గీ॥ ప్రబలులై మించినట్టి హిరణ్యపురని
వాసులను గెల్వఁగదలిన వైపు దనర
నిట్టియానప్రకారంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 136

గీ॥ అరికి వ్యసనంబు గల్గినయట్టివేళ
నరికి దైవంబు దోడుగానట్టివేళ
నదనుఁ జేకొని దండెత్త నర్హ మండ్రు
నీతిమార్గం బెఱింగిననృపవరునకు ॥ 137

ఆసన ప్రకరణము

వ॥ ఆసన ప్రకారంబు. 138

కం॥ అరియును విజిగీషుధరా
వరు లిరువురు బలిమికలిమి వడినొండొరులన్
దెరలింపలేక యుండుట
వర నాసన మనఁగఁ బరగుఁ దజ్జ్ఞులచేతన్ ॥ 139

వ॥ అవియును విగృహ్యాసనంబును సంధాయాసనంబును ప్రసంగాసనంబును, సంభూయాసనంబును, ఉపేక్షాసనంబును నన నైదు తెఱంగులయ్యె వానివ్యాపారంబులు గ్రహింపుము వివరించెద. 140

సీ॥ ఒక్కరొక్కరిమీఁద నొండొరుల్ గినిసి
మొండొడ్డి యెత్తిపోకుండుటయును
నడుమ వైరితోడ విగ్రహమునఁ దాఁకు ను
గ్రమునఁ జై సొమ్మంటి కానివేళ
ధాన్యాదికము మిత్రవితతులను గట్టియల్
గన్నను జొరకుండఁ గాఁచియుండి
ముట్టడిగాఁ జుట్టుముట్టుకొను మనుండు
నట్టిది యగును విగృహ్యాసనంబు

గీ॥ వైరిపై నట్లు ముట్టడి వైచి యెంచి
ప్రకృతు లన్నియుఁ జెడఁ జాపి యగడఁ జెప్పఁ
గైవసము చేసికొనఁ దగు కాలమెఱిఁగి
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 141

సీ॥ రావణాసురుఁడు పూర్వమున దేవతత
సములతోఁ బోరాడి వారుఁ దాను
నలసి చతుర్ముఖు నంపి సంధి యొనర్చి
నట్టులు విజిగీషు నరియుఁ బోరి
యలసి సంధియొనర్చి కలసియుండుటయు సం
ధాయాసనంబనఁ దనరుచుండు
నది గాక యరిమీఁద నలవుసఁ గడచి పై
తాఁక ప్రసంగము చెంది యొరునిమీఁద

గీ॥ కడఁగి దండెత్తిపోయి తా విడిసియుండు
సది ప్రసంగాసనం బన సమరుచుండు
నిట్టి చందంబు లెల్లఁ దా నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 142

సీ॥ అరివిజిగీషువులఁ దా నాక్రమించుటకు మ
ధ్యముఁడు పై దండెత్తఁ దలచినప్పు
డరియును విజిగీషు వన్యోన్యమైత్రిచే
నొనగూడి బల్మిచే నుండు టొప్పు
నదిగాక ఘనుఁడైన యల యుదాసీనుండు
గనిసిన నరివిజిగీషువులను
వక్కసవారెల్ల నొక్కటైయున్న సం
ధాయాసనం బనఁ బొలుపుమీఱు

గీ॥ నిట్టిభేదంబులెల్లను నెపుడు చిత్త
మందెఱుఁగనుండ నేర్చిన యట్టిరాజు
పదరిపుల గెల్చి సకలసంపదలఁ బొల్చి
జనులు వినుతించ మించి యిజ్జగతి నేలు ॥ 143

సీ॥ బలియుఁడై కృష్ణుండు పారిజాతముఁ దెచ్చు
చోట నుపేక్షించి సురవిభుండు
పవిరకయున్నట్లు పగతుఁడు బలియుఁడై
యున్నచోఁ దా నూరకుండునదియు
నొకహేతువునఁ జేసి యొకశాత్రవుఁడు పేర్చి
తను నుపేక్షించిన దానిఁ గొనుచు
ముసు రుక్మియుండిన యనుపున నుండుట
యది యుపేక్షాసన మనఁగఁ దనరు

గీ॥ నిట్టిభేదంబు తెల్లఁ దా నెపుడు చిత్త
మం దెఱిఁగియుండ నేర్చినయట్టి రాజు
మదరిపుల గెల్చి సకలసంపదలఁ బొల్చి
వసులు విసుతించ మించి యీజగతినేలు ॥ 144

## ద్వైధీభావ ప్రకరణము

వ॥ మఱియు ద్వైధీభావంబు స్వతంత్రపరతంత్రభేదంబున రెండు
తెఱంగు లయ్యెనందు స్వతంత్ర ద్వైధీభావం బెట్లనిన. 145

సీ॥ ఇరువురు పృథ్వీశులకుఁ దన కిద్దఱుశత్రులు
బలవంతులై యున్నఁ గలఁకపడక
వారివారికిఁ జూడ వారివారలను బోలెఁ
దన్నుఁ దక్కొరులుగా నెన్నిపల్కి
కాకాక్షివలె నిరుగడల వర్తింపుచు
నందుఁ జేరువదాన సంధి యత్న
మును గడుపుచు నిద్ద రెనయక యొత్తిన
నందులో బలవంతు నాశ్రయించి

గీ॥ వార లెద్దియు వదలిన వారియరులఁ
దాన బలవంతు నొక్కనిఁ బూని కొలిచి
సదపఁగా నేర్చి కాలంబు గడపెనేని
యది ద్వైధీభావగుణ మని యండ్రు బుధులు ॥ 146

కం॥ సాధారణుఁడై యిరుగడ
భూధవులకు నెనసి ఫలముఁ బొరయుట యది దా
సేధారుణిఁ బరతంత్ర
ద్వైధీభావం బనంగఁ దనరుఁ బెద్దలచేతన్ ॥ 147

## సమాశ్రయ ప్రకరణము

వ॥ మఱియు సమాశ్రయగుణంబు బలవంతుండగు విరోధియైనను గాక తనశత్రువునైన నాశ్రయించుటంజేసి రెండు విధంబులై యుండుఁ దత్క్రమం బెట్లనిన. 148

సీ॥ బలవంతుచే నొంపఁబడి నిరుపాయుఁడై
ప్రతిసేయఁగా లేక బడలినపుడు
కులమును సత్యంబు బలమును గల్గిన
యార్యుని నొక్కని నాశ్రయించి
వినయంబుతో నిత్యమును దొడగని చేరి
యతనిభావం బెల్ల నాత్మ నెఱిఁగి
చెప్పినకైవడిఁ జేసి వినీతుల
గతి గురువులఁ గొల్చుకరణిఁ గొల్చి

గీ॥ యతనిదయచేతఁ బరిపూర్ణుఁడై స్వతంత్ర
వృత్తిఁ జెందుచుఁ గ్రమమున వెలయు టొప్పు
నిట్టి యన్యసమాశ్రయం బెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 149

సీ॥ అహితులచే నొచ్చి యార్తుఁడై యాశ్రయ
హీనుఁడై తన సంధిలేనివాఁడు
దండారమైనను బలమునైనను భూమి
యైనను భూఫలంబైన మఱియు
సకలంబునైన నిశ్చలతఁ జెందుచు నిచ్చి
యతివినయంబున నతనిఁ జేరి
తా బల్మిచెందిననతఁడైన శత్రువుఁ
దాపదఁ జెందిన యప్పుడైన

గీ॥ దేశ మెఱిఁగి విజృంభించి విమతుఁ ద్రుంచి
మైనఁ గొలిపించికొనియైన నలఁప నొప్పు
నట్టి శత్రుసమాశ్రయం బెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిన నృపవరుండు ॥ 150

చం॥ వినుటయు వేళగానితఱిఁ దాఁ బగవారలకెంతు సర్వముం
గినుకక యిచ్చి, యిచ్చలును శ్లేషము వచ్చిన నైన నోర్చి యే
యనువునసైనఁ దాఁగొని యసూయనునైనను జేరి క్రమ్మఱన్
మనుమ వరిత్రిఁ గైకొనుట మంచిది యెంచగ ధర్మజుంబలెన్ ॥

తే॥గీ॥ కారణంబు లేక కవిసి కూడఁగరాదు
ఘనుని నైన నీచజనుని నైన
కారణంబు లేక కలసిన క్షయమును
వ్యయము దోషములును వచ్చుఁగాన ॥ 152

మ॥ ఇలఁ దేఁ బాహ్యప్రకారణంబునఁ దా నెవ్వారితో నైన నే
ప్పులఁ గాడంపనఁ గూడియుండిన యొకం డొప్పిందిచిత్తంబులో
పల సమ్మంగొఱగాడు తండ్రినయినం బాటించి దుష్టాత్మకున్
బలఁపు న్నమ్మిక యుట్టి సాంగజులం దారెంతు హింసించుటన్ ॥

వ॥ ఇది షడ్గుణస్వరూపంబు. వీనిం గొందఱు మతస్థులు వైష్ణ
వాదసమాశ్రయంబులు సంధిమూలంబులు గావున సంధిగుణం
బొక్కటియును దండువెడలుటయును విడియుటయు విగ్రహ
మూలం బగుటం జేసి యానాసనంబులు విగ్రహభేదంబులే కావున
విగ్రహగుణం బొక్కటియునుం గూడ నిట్టి సంధివిగ్రహంబులు
రెండుగుణంబులే యని పలుకుచుండుదురు. మఱియు బృహస్పతి

మొదలయిన కొన్నిమతంబులవారు శత్రునిచేత బాధింపం బడినవాఁ డితరుని నాశ్రయించుటంజేసి సమాశ్రయగుణంబుఁ బ్రత్యేకంబు గావున నాసంధివిగ్రహంబులు రెంటను నెట్టి సమాశ్రయంబునంగూడి మూఁడు గుణంబులే యని పలుకుచుండుదురు. మఱియుఁ గొన్నిమతంబులవారు సంధ్యాదిగుణపంచకంబును విగ్రహమూలంబె కావున విగ్రహగుణంబొక్కటియ న్యాయం బని పల్కుచుందురైనను వీని కన్నిటికిఁ బ్రత్యేకంబైన యవస్థాభేదంబులు గలుగుటంజేసి యీ కామందకమతంబునకు షాడ్గుణ్యంబె సమ్మతంబు ॥ 154

కం॥ ఈరీతిషడ్గుణంబుల
నేరుపుతోఁ దెలియునట్టి నృపవరుఁ డెలమిన్
వైరులను గెలిచి పారా
వారావృతమైనధరణీవలయం బేలున్ ॥ 155

చం॥ సరసవిహార సారయుతసద్గుణ సింధుగభీర నీతి సు
స్థిరరుచికీర్తిహార సుదతీజనమన్మథ సూర్యవంశవా
స్వరతర సేవితార్యజనసైన్యవిరాజిత సోమవారిభృ
చ్ఛరనిధిదాన సౌమ్యహిత సంతతశోభన సర్వసన్నుతా ॥ 156

కం॥ ఖండలశోధన సాధన
పాండిత్యా షడ్గుణప్రభావజ్ఞ ధరా
మండల పాలనఖేలన
పండితమత్తారిభూప దానకలాపా ॥ 157

భుజంగ ప్రయాతము.

ధరాధార దోర్దండ దానప్రచండా
పరాభేద్యమంత్రప్రభావ స్వతంత్రా

స్ఫురద్గాంగ భంగాహిభూషాంగవాణీ
తురంగాబ్జ శీతాద్రితుల్య స్వకీర్తీ॥ 158

గద్యము :- - ఇది శ్రీమన్మదనగోపాలవరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజగోత్ర జక్కరాజయెల్లనామాత్యపుత్ర సుకవిజనవిధేయ శ్రీరామకృష్ణభక్తి వైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన కామందకి నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు మండలశోధనప్రకారంబును షడ్గుణప్రచారంబు నన్నది చతుర్థాశ్వాసము.



# ఆంధ్ర కామందకము

## పంచమాశ్వాసము

కం॥ శ్రీవినుతాలోక జగ
త్పావన రఘురామ పాదపంకజయుగళీ
సేవాధురీణ శాంత
ప్రావృత కొండ్రాజువెంకటాద్రి నరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### మంత్రవికల్ప ప్రకరణము

గీ॥ నృపతి షడ్గుణతత్త్వంబు నిశ్చయించి
గూఢ మగుచర్యఁ దగ మంత్రకుశలుఁ దగుచు
మంత్రివర్యులతోఁ గూడి మంత్రరీతు
లమర నూహింపఁదగు రహస్యంబుగాఁగ ॥ 3

కం॥ తన కాప్తుండై తగుప్రా
జ్ఞునితో మంత్రం బొనర్పఁ జొప్పుఁ బతికిన్
దన కాప్తుండౌ మూర్ఖునిఁ
దన కాప్తుఁడుగాని ప్రాజ్ఞుఁ దా విడువఁదగున్ ॥ 4

కం॥ ధర యెల్ల ననుభవించును
నరనాథుఁడు మంత్ర మెఱిఁగినం గాకున్నన్
బరిభవ మొందు స్వతంత్రతఁ
బరగియు మంత్రంబు నెఱుఁగఁ బ్రాజ్ఞులచేతన్ ॥ 5

క॥ పగతులచే దుర్మంత్రం
బగుదారి చెడు దుష్టమంత్ర మగుయజ్ఞము దై
త్యగణముచే బలెఁ గావున
జగతిన్ సన్మంత్రమునఁ బొసంగఁగవలయున్ ॥ 6

చ॥ అనిశము ధర్మమార్గములయందె చరించినవారు సిద్ధమై
యొనరినయట్టి కార్యముల నూర్జితులై తగువారు పెద్దలై
చనరినవారు నైనగుణధన్యులు చెందినశాస్త్రమార్గ మెం
దును వదలంగ రాదు నయధుర్యులకున్ నిజకార్యసిద్ధికిన్ ॥ 7

క॥ జనపతి శాస్త్రముతో నెడ
సినచర్యల వేగిరమునఁ జెంది మెలఁగినన్
దనశత్రునిచే ఖడ్గం
బునకున్ గ్రాసంబు గాకపోవం గలఁడే ॥ 8

క॥ బలిమిఁ ద్రిశక్తులలోపల
నల మంత్రము మంత్రశక్తి ననువొందక కే
వలము ప్రభావోత్సాహ
మ్ములఁ గల్గియు శుక్రుఁ దోడె మును గురువునకున్ ॥ 9

ఉ॥ నీతి యొకింతయుం దెలియనేరని సింగము బల్మిచేతఁ దా
నేతటియందు నేనుఁగుల నెల్ల వధింపుచు నుండు బుద్ధియున్
నీతియుఁ గల్గినట్టిపతి నేర్పున సింగపుగుంపులం గరి
వ్రాతము నుక్కడం గెలిచి వర్ధిలకున్నె ధరాతలంబునన్ ॥ 10

గీ॥ మనుపు సామాద్యుపాయముల్ మొనపవలయు
కాల మెఱుఁగుచు వైరిపైఁ గదియవలయుఁ
గాక మఱి కేవలంబు విక్రమముఁ బూని
మెలఁగువాఁ డెందు వగఁ జెంది కలఁగకున్నె ॥ 11

చ॥ చల మెదలించి భూవిభుఁడు శక్య మశక్యమనా పనుల్ గొఱుం
జెలఁగెడిబుద్ధిచే నెఱిఁగి చేసిన మే లగు నట్లు గానిచో
నలవునఁ గొండ ఢీకొనినయమ్మదదంతికి దంతభంగమౌ
పొలుపున హాస్యరీతులను బొందక యెందు శుభంబుఁ జెందునే ॥

కం॥ తొడరి యశక్యవుఁ బనికై
బదలినచోఁ గీడ కాక ఫలమొందునె యె
య్యెడ విస్సు నవిఁగొనంగాఁ
గడఁగెడి పెనువెట్టికందు కడిఁ గొనఁగలదే ॥ 13

ఆ॥వె॥ మిఱుత యగ్నిలోనఁ బడునటు నాశంబు
వచ్చుపనులఁ బూన వలవ దెపుడు
తగినపనులె పూనఁదగు నగ్నిలోఁబడు
మిడుత కేమి కలదు చెడుటకంటె ॥ 14

కం॥ ఇలలో దుర్లభమగుపని
బలియుఁడు మోహమునుఁ జెంది పదరిన నందుᳵ
గలిగినయాపద లతనిం
గలకాలముఁ దాప మొందఁగాఁ జేయుఁదుదిᳵ ॥ 15

కం॥ అనుపమమతిచే సిరులను
జనపతి దా నాక్రమింపఁ జను నేర్పున మె
ట్టనువుగ మెట్టెడునాతఁడు
ఘనమగుగిరి శిఖర మెక్కుకై వడి మెఱయుᳵ ॥ 16

ఉ॥ అందగ దుర్లభంబగుచు నందఱు మ్రొక్కులు మ్రొక్క నిక్కి పెం
పొందినయట్టిరాచఱిక మొక్కఁడ నించుక దుష్టవర్తనం
జెందినయేని నాశనముఁ జెందదె యెం దపచార మింత దాఁ
జెందినబ్రాహ్మణత్వము గ్రహింపుచు నిందల నొందుకై వడిᳵ ॥

కం॥ విమలమతు లెంచి శాస్త్ర
క్రమమున నొనరించునట్టికార్యంబులు వే
గమె మంచిఫలము లిడుఁ దా
సమరంగాఁ బ్రోదిఁగనినయల వస మనఁగన్ ॥ 18

కం॥ అనువుగ నొనరించినపను
లనిశము ఫలియింపుచుండు నది కాకున్నన్
మసమునఁటఁ దాప మొసఁగపు
మును దెలియక సేయుకార్యములుబలెఁ బతికిన్ ॥ 19

గీ॥ నేర్పు మీఱంగ లెస్స యొనర్పఁబూని
కార్య మొకరీతి సఫలంబు గానివేళ
వాఁడు నించకుం దగినట్టివాఁడు గాడు
తానె దైవంబు కడుఁదోడుగానికతన ॥ 20

కం॥ ఫలములకై నిర్మలమతి
గలవాఁ డుద్యోగశాలి గావలె నెందున్
ఫలవిఘ్న మడరకుండన్
బలవద్దైవంబు నెఱిఁగి ప్రార్థింపఁదగున్ ॥ 21

కం॥ తనబలిమి నెదిరిబలిమిం
గనుగొని యరిమీఁద గదలఁగాఁదగు నెదుపం
దను నెఱుఁగుటెద్ది యదివో
జనపతులకు నెఱుక నీతిచాతుర్యంబుల్ ॥ 22

కం॥ ఆర్యులు విడుదురు నిష్ఫల
కార్యము నిశ్చితఫలంబు గలుగక యెడతౌ
కార్యము బహువైరముఁ గల
కార్యము కడుగ్లేశమడరుకార్యముఁ బుధమిన్ ॥ 23

కం॥ తగుకార్యములె విహితములఁ
దగిలినయవి యెపుడు మీఁదఁ దా మంచివియై
తగు నవి తొలుతన్ సజ్జను
లగువారిక్రమాగతంబు లైనవి పతికిన్ ॥ 24

గీ॥ ఎట్టికార్యంబు దనకును హితవొనర్చు
నెట్టికార్యంబుచే నింద లెనయకుండు
నట్టికార్యంబె పూని చేయంగవలయు
నప్పు డించుకకతిసమై యదరెనేని ॥ 25

కం॥ సులభమునఁ గార్యసిద్ధులు
గలుగుటకై బుద్ధిచేతఁ గార్యము బూనన్
వలయుఁ బతి మంచిమిత్రులఁ
గలిగినచో సింహవృత్తి కడు మేలొకటన్ ॥ 26

చం॥ తొడిఁబడ మించి పైకుఱికి దుష్టవిరోధుల వంచి సంపదన్
వడయుట లెంచ దుష్కర ముపాయబలమ్మున నేదియైనచో
నప్పుడి తగుమావటీఁడు బలభద్రగజంబుశిరంబుమీఁదటన్
దొడరియు వాయుమార్గములతోడఁ బదం బిడు లెందుఁ జూడమే॥

ఆ॥వె॥ చతురమతి కుపాయసరణిచే సాధ్యంబు
గానివస్తు వించుకయును గలదె
యినుపముద్ద యైన నిలలోన నీరుగా
కఱఁపఁ బడును చెఱిపి విఱుపఁబడును ॥ 28

కం॥ జల మింగలంబు నార్పుట
యిలమీఁదటఁ గడుఁబ్రసిద్ధి యాయింగలమే
బలువగు నుపాయశక్తిని
జలచలచలఁ దెరలఁజేసి జల మిగిరించున్ ॥ 29

వ॥ మఱియు మంత్రంబునకు జ్ఞానంబును, రక్షణంబునుఁ, బ్రకా
శంబునుఁ బ్రశస్తియు నంగంబులును వ్యాపారంబు నుత్పత్తి
క్రమంబునుఁ బరిశుద్ధియు ఫలసిద్ధియు నావర్తనంబును, ధారణం
బును, మొదలయిన యవస్థాభేదంబులు గల వందు విధుండు
సాక్షాత్కారంబునం దెలియనియర్థంబు తెల్లం దెలియుట యనెడి
యవిజ్ఞాతవిజ్ఞానంబును దెలిసినయర్థంబు కర్తవ్యపూర్వకంబుగా
నిర్ణయంబుఁ గావించుటయనెడి విజ్ఞాతనిశ్చయంబును సందు
రెండు కార్యంబులు ప్రసక్తంబులైన నొకటి గావనుట యనెడి
సందేహచ్ఛేదనంబును, మఱియు సంధివిగ్రహంబులలోన పృష్ట
సమ్మతంబున సంధియ మంచిదనుటఁ దెలిసి యదియును ఛేద
పూర్వకంబైన చెప్పయని తెలిసికొనుట యనెడి శేషదర్శనంబును
నను నిట్టి చతుర్విధ భేదంబులుగల జ్ఞానంబు మంత్రులవలనఁ
సంభవించుంగావున. 30

సీ॥ మంత్రియుఁ దానును మతులందు చెప్పగాఁ
బరిశుద్ధిసేయు టుత్పత్తియండ్రు
తనరు నుత్పత్తిచేఁ దనమంత్ర మది చెప్ప
తెలిసి రక్షించుట స్థితియటండ్రు
చాల దానినిఁ బ్రకాశంబుగాఁ జేయుటే
మఱి లయ మని యండ్రు మంత్రమునకు
నిన్నియు నెఱుఁగుచు నిది దేశ మిది కాల
మిది యాయ మిది వ్యయం బిది బలంబు

గీ॥ దీని కిది యుక్త మంచును దెలివితోడ
మంత్రవిదులను గూడి నెమ్మదిఁ దెలంగి
శాస్త్రమార్గంబు వదలక చతురుఁ డగుచు
మంత్ర మూహింపవలయును మనుజవిభుఁడు॥ 31

కం॥ జనపతి తనమంత్రులయా
జ్ఞనె మెలఁగుచు నుండి యెట్టిజనులను దాఁ గా
ఎసక మఱి యన్నిపలుకులు
వినవలయును మంచిమాట వెదకెడికొఱకై ॥ 32

కం॥ తనమది మదించి పనియెడఁ
దనమంత్రుల మీఱుపతి ప్రధామంత్రుఁడు నీ
డని నింద నొందు నతనిని
గనుఁగొని రిపు లాక్రమింపఁ గడఁగెదు రెపుడున్ ॥ 33

కం॥ మంత్రము రక్షింపఁగవలె
మంత్రము మూలంబు మిగుల మనుజేంద్రునకున్
మంత్రము నెడఁ దాఁ జెడుఁ ద
న్మంత్రము రక్షింప రక్షణముఁ గనుఁ దానున్ ॥ 34

కం॥ చతురుఁడయి కాల మెఱుఁగుచు
నతులితగతి సింహవృత్తి నడరెడుధరణీ
పతి కార్యము సేయుతఱిన్
హితులను నది యైన నహితు లెఱుఁగఁగవలయున్ ॥ 35

కం॥ ఫల మెవ్వేళ నొసంగన్
గలుగుచుఁ గడువేగఁ గోర్కి ఘటియింపంగాఁ
గలుగుచుఁ బశ్చాత్తాపము
గలిగింపనియట్టిమంత్రిగతి మంచిదగున్ ॥ 36

మంత్రాంగములు

ఆ॥వె॥ దేశకాలగతులు దెలియుట, సాధనో
పాయచింతయును, సహాయవితతి,
నాపదలకుఁ బ్రతిక్రియయుఁ, గార్యసిద్ధియు
నైదు మంత్రమునకు నంగము లగు ॥ 37

కం॥ పూనినపనిఁ జేయవలెఁ
బూనినపను లెల్లఁ దొడరి పూనఁగవలయుం
బూని యొనరించునాపని
దా ననువుగ విరివికొనఁగఁ దగు నాయమునన్ ॥ 38

కం॥ ప్రారంభింపక యుండుట
పురుషునకుఁ బ్రథమబుద్ధి పూనికతోడం
బ్రారంభించినపని యా
దేయుచుట ద్వితీయబుద్ధి యాధరలోనన్ ॥ 39

కం॥ సారెకు బహుమంత్రులతో
ఘారయుచుఁదు కార్యమార్గములు దెలఁపఁదగున్
వారలకును సమ్మతమగు
సారపుఁగార్యంబుఁ బూనఁ జను నెవ్వనరన్ ॥ 40

గీ॥ ఎంత సజ్జనులనువారు నింద సేయ
రెంతఁ దనపుది సందేహ మొందిపంతు
నెంత మంత్రులు సమ్మతిఁ జెంది యుంద్రు
తలఁప సటుపంటిపనిఁ బూనవలయు విభుఁడు ॥ 41

కం॥ మంత్రులచే నిశ్చితమగు
మంత్రముఁ జింతింపవలయు మదిఁ బలుమారున్
మంత్రజ్ఞుఁ డగుచుఁ బతిఁ దన
మంత్రముచేఁ దనముపనులు మఱి చెదకుండన్ ॥ 42

కం॥ వారలు మొగియక యుండన్
దా రొనరింపుదురు మంత్రితతి దదవదరన్
బోరులు మొగియక యుండిన
సారపుభోగములు దిమకు సమకొనుకతనన్ ॥ 43

## కార్యసిద్ధి సూచకములు

గీ॥ పౌరుషంబు సహాయసంపద మనఃప్ర
సన్నతయు దేహదార్ఢ్యంబు సమకొనుటయు
బుద్ధి విశ్వాసమును జాలఁ బొడముటయును
గార్యసిద్ధికి గుఱుతులై కానుపించు ॥ 44

కం॥ సులభములగు యత్నంబులు
గలుగుట, తగుసాధనములు గలుగుట, విఘ్నం
బులు లేకుండుట, కార్యం
బులకున్ ఫలసూచకములు భువి నివి తెలియన్ ॥ 45

కం॥ పలుమరు మదిలోఁ దలఁపఁగ
వలయున్ మంత్రము ధరింపవలయును యత్నం
బలరఁగ నటుగాని యెడం
ఆలియింపుచు నగ్నిలీలఁ జాల దహించున్ ॥ 46

కం॥ వెలివడు మంత్రం బాప్తుల
వలనన్ రక్షింపకున్న వసుధాపతికిన్
దెలిసి యటుగాన నాప్తుల
వలనను మంత్రంబుఁ బ్రోవవలె యత్నమునన్ ॥ 47

ఆ॥వె॥ కలువరింతపలుకువలనఁ గామమువల్ల
మదమువలన మఱి ప్రమాదములను
గదిసి గుట్టుఁ దెలియుఁ గామినీవితతుల
వలన మంత్ర మదియు వసుధలోన ॥ 48

గీ॥ కంబములు లేక సోరణగండ్లు లేక
నడుమ గోడలు లేక పెంపడరుచోట
మేడపైఁ గానలో నైన మెలఁకువ వలర
మంత్ర మూహింపవలయును మనుజవిభుఁడు ॥ 49

మంత్రిమండల వృత్తము

సీ॥ తొలుదొల్త మంత్రిమండలముతో మంత్ర మూ
హింపఁగాఁ దగు నభివృద్ధికొఱకు
సది యెట్టు లన్న దేవాచార్యమతము వా
రఖిలసమ్మతిఁ బదియార్వు రంద్రు
మనువు పన్నిద్ద రైనను జాలు నని పల్కె
మఱియు శుక్రాచార్య మతమువార
లిరువదియగుసంఖ్య నెంతు రీమంత్రుల
నితర మతంబువా రెటులనైనఁ
గీ॥ గలిగినందఱె చాలు మంత్రు లని యందు
రిటుల మంత్రులసంఖ్యఁ దా నెఱుఁగ నేర్చి
వారిఁ దెలియంగఁదగు వేఱు వేఱ సారె
శాస్త్రమార్గంబు వదలక జనవిభుండు ॥ 50

చం॥ హితుఁడయి మంచిపక్షమున నెన్నిక కెక్కుచు నీతిశాస్త్రసం
గతముగఁ గార్యచర్యలఁ దగం జరియించినవాఁడు నాత్మస
మ్మతుఁ దగువాఁడునైన తనమంత్రిశిఖామణి పల్కునట్టి యా
మతమె యొనర్పఁగా నగును మానవనాథున కెట్టివేళలన్ ॥ 51

కం॥ మును మంత్రనిశ్చయంబున
నెనసి నృపుల్ కార్యకాల మెఱిఁగి మెలంగన్
జనుఁ గాలము మీఱినచో
ననువుగఁ గల్పింపవలయు నది మగుడంగన్ ॥ 52

కం॥ అదను మదిఁ గోరుచుం దగు
నద నొక్కొకవేళ దొరకునపుడు దనపనుల్-
కొదవయిడికొనినఁ గ్రమ్మఱ
నద నబ్బుట దుర్లభం బటంద్రు నయజ్ఞుల్ ॥ 53

కం॥ మతిమంతుఁడు సన్మార్గము
గతిచే నద నెఱిఁగి సేయఁగాఁ దగుఁ గార్యం
బతినియతి నెటులనైనన్
క్షితిలోపల మంచిఫలమె చేకొనుచుండున్ ॥ 54

మ॥ ఇది యీరీతిది దీని కిట్లనుచుఁ దా నెంతే విశుద్ధాత్ముఁడై
యదనన్ దేశమునందు భూపతి సహాయశ్రేణితోఁ గూడి స
మ్మద మొప్పన్ బరిశుద్ధపార్శ్వుఁడగుచున్ మత్తారివీరావళిం
జదుపంగాఁ దగుఁ గాక చాపలగుణేచ్ఛన్ వర్తిలం జెల్లునే ॥ 55

చం॥ అహితములైనఁ గార్యములయందు హితంబును బుద్ధి నేర్చి యీ
మహిపయి మూఢుఁడౌనతఁడు మంత్రులమాటఁ దిరస్కరించి తా
సహితులమీఁదటం జపలుఁడై కడు వేగమె పోయి వారునన్
సహితకరాసులెత్తి పరిమార్చినచోఁ జెలియు న్మనంబునన్ ॥

చం॥ ఎదిరిబలాబలంబు లొకయింత యెఱుంగక మంచిసాహసం
బొదవ మదించి మించి బలియుండను నేనె యటంచుఁ గొంచమౌ
పదిఁ దమకించుభూపతి సమంచితచంచలవృత్తి శత్రుపైఁ
గదలి దురంబులోనఁ బడుఁగాక సుఖస్థితి నుండ నేర్చునే ॥ 57

మ॥ అమితోద్యోగముఁ గల్గినట్టిరిపురాజానీకముం గ్రూరస
ర్పములం బోలె నయప్రవర్తనలచే భాసిల్లుభూపాలకుం
డమర న్మంత్రబలంబుచేఁ దనవ లోనై యుండఁగాఁ జేయు ట
ర్హమగున్ ధారుణి సల్లొనర్చిన నృపాలాగ్రేసరుండై తగున్ ॥

వ॥ ఇది మంత్రస్వరూపం బింక దూతచారులప్రకారం బెట్లన్నను. 59

చం॥ అనువుగ మంత్రముం దెలిసి యందలి యర్థము లాచరించు రా
జనిశము దూతకృత్యములయం దభిమానముఁ గల్గి మంత్రులౌ
జనులకు నెల్ల మంత్రమున సమ్మతుఁడై తనదూతఁ బంపఁగాఁ
జను సమయంబుఁ ద్రొబ్బుటకు శాత్రవమర్మవిభేదశాలియై ॥ 60

కం॥ తలఁచుకొనుశక్తి ప్రౌఢిమ
పలుకులనేర్పులును శాస్త్రపరిచితిఁ గార్య
మ్ములయభ్యాసము నాయుధ
ములతెలివియుఁ గలుగువాఁడు భువి దూత యగున్ ॥ 61

దూతభేదములు

సీ॥ కార్య మెంతయు-హస్తగతఁగాఁ జేయఁజాలిన
యతఁడు నిసృష్టార్థుఁ డనఁగఁ బరగుఁ
జెప్పినట్లే పోయి సేయఁగా నేర్చిన
యతఁ డరయ మితార్థుఁ డనఁగఁ బరఁగు
నేమియు నెఱుఁగక యేలినాతనిపమ్మ
నందించ శాసనహారకుండు
జగతిలో నీరీతిఁ దగి మూఁడు దెఱఁగులై
చరియింతు రీదూతజనులు వరుస

ఆ॥వె॥ బరఁగ నంబు లిటులఁ బలికినఁ దా నిట్లు
పలుకవలయు ననుచుఁ దలఁచికొనుచుఁ
బోవఁదగినయెడకుఁ బోవఁగా వలయును
క్షితిపవరుననుజ్ఞచేత దూత ॥ 62

కం॥ అలజడివారల నాటవి
కులఁ దనకున్ లోనుజేసికొనఁదగు మఱియున్
జలములపెక్కులు త్రోవలు
దెలియఁగఁదగు దనదు నేనఁ దెచ్చుట కొఱకై ॥ 63

కం॥ అరిపురము నతనిసభయుం
జొరవలయుఁ బ్రకారరీతిఁ జొప్పడ నరిచేఁ
బరికింప ననుమతుండై
యురవుకొనం జనఁగ నొప్పు నిల దూతలకున్ ॥ 64

ఆ॥వె॥ శత్రు నతనిరాష్ట్రసారంబు నతని దు
ర్గంబు దుర్గరక్షణంబు మిత్ర
వితతి యతనికినియువేళ భండారంబు
లెస్సఁ దెలియవలయు లీల దూత ॥ 65

చం॥ తనవిభుఁడెట్లుపల్కు మన దా నరితోడుత నట్ల పల్కఁగాఁ
జనుఁ దనమీఁదఁ గైదువలు సాఁచిన నించుక భీతి లేక చూ
పున ముఖచేష్టవల్లఁ దలపోయుచు రాగవిరాగభావముం
గనుఁగొనఁగాఁదగున్మఱియుఁగార్యమెఱుంగఁగఁజాతచాతురిన్

చం॥ తనకు ననిష్టవాక్యములు దాఁకొనన్ జనుఁ గాపమున్ పడం
బును మఱి క్రోధము న్విడచి పోఁ దఱుపం దగు నిద్రపోవగాఁ
జన దొడుతోడఁ గూడుకొని చాలఁబరేంగితముల్ గనుంగొనన్
జనుఁ దనభావ మెయ్యడఁ బ్రచారము సేయఁగ రాదు దూతకున్॥

గీ॥ వైరులందు నమాత్యాదివర్గ మనెడి
ప్రకృతులకుఁ గల్గురాగాపరాగములకుఁ
దెలియఁ దగు మఱి భేదింపవలయు వారి
నరసి భేదింపఁ దగు రహస్యంబుగాఁగ ॥ 68

కం॥ తనపతిగుణములఁ బ్రకృతులఁ
దను నడిగినఁ బలుకవలదు ధరణీశులతో
డను సర్వము మీ రెఱుఁగరె
యని పల్కఁగ వలయు మంచివగుపల్కులచేన్ ॥ 69

కం॥ కులమునుఁ గరుఁ బేరెన్నిక
గలుగుట ఘనమైనయట్టి కార్యపుసేతల్
కలిమి యన నాల్గుదెఱఁగులఁ
గల వినుతులఁ బతిని రిపుని గణుతింపఁ దగున్ ॥ 70

ఉ॥ జీతము రెండుదిక్కులను జెందెడివారలచేత శిల్పముల్
చాతురి గల్గువిద్యలు విచారము సేయునెపంబుతోడఁ దా
నేతఱి శత్రురాజు ఘటియించినకార్యము భేద్యకోటి ధా
త్రీతలభర్త సేయఁ దగురీతులు దూతయెఱుంగఁగాఁ దగున్ ॥

గీ॥ తీర్థముల నాశ్రమంబుల దేవతాల
యములయందుఁ దపస్వివేషముల మెలఁగు
నట్టిచారులతో మాటలాడవలయు
శాస్త్రరీతులు దెలియువ్యాజంబుచేత ॥ 72

కం॥ తనవిభుఘనత ప్రతాపం
బును మంచితనమ్ము సత్యమును గరిమ కులం
బును దానము నుత్సాహముఁ
బెను పొందఁగఁ బలుకవలయు భేద్యులతోడన్ ॥ 73

కం॥ ఇల నిదురవోతు మత్తుఁడు
గలభావమె బలుకుచుండుఁ గను దూత యొకం
గలయక నిద్దురవోఁ దగు
వల దెప్పుడు బోనములను వనితలఁ దలఁచన్ ॥ 74

కం॥ తనకార్యసిద్ధికొఱకై
ఘనముగఁ దడవైనయపుడు గడు వెతఁబడఁగాఁ
జన దెపుడు దూతవర్యుఁడు
తనకార్యము పొసఁగువిధమె తలఁపఁగ వలయున్ ॥ 75

వ॥ మఱియు రాయబారియగునతండు శత్రురాజు ననుసరింపుచు నుండునెడఁ దమయేలికరాకయును నొడంబడిక యాలస్యంబైన యెడఁ గ్రమంబున మంచిదనంబు మించ వంచనావాక్య ప్రపంచంబులఁ గాలంబుఁ గడపుతెఱఁగెట్లన్నను, దనవిభునకు

నొకయించుక వ్యసనంబుఁ గలిగియున్నకతనను, నొరులతో నొకయించుక వ్యాజ్యంబుగలుగు కతనను దమబంధువులలోనఁ గలహంబుఁ బుట్టిన నీతిపరుండు గావున నివియు వారించు కతనను ఫలకాలంబు గాన ధాన్యాదిసంగ్రహంబు సేయుచుండు కతనను దుర్గంబునకు సవరణలు సేయించుచుండుకతనను దన సైన్యంబులకు క్షేమంబుఁ గోరువాఁడై వర్షాదికాలదేశవిషయంబులవలనఁ దా రాకయున్నకతనను దాన ధనాదికంబు వట్టించుకొని వచ్చువాఁడై యున్నకతనను, వెలిగుడారంబులు వేసి పయనంబునకు సామగ్రి యొనఁగూర్చుకొనుచుండుకతనను, నాలస్యం బయ్యెనని యుచితరీతులఁ గాలంబు గడుపుచు నుండి. శత్రువునకుఁ గార్యకాలంబులోనఁ గూడకయుండుట తెప్పఁ దెలిసి మగుడివచ్చియైనను రాకయుండి యైనను శత్రువార్తలన్నియు తెప్పగాఁ దనయేలికకు నెఱింగించవలయు నతఁడును. 76

సీ॥ పగఱసామర్థ్యంబు బలమును దుర్గంబు
భండారమును మిత్రబంధుతతుల
నతఁడు పూనుచునుండు నట్టికార్యంబుల
తెఱఁగులు తెప్పగాఁ దెలియుటయును
గడలఁగావలివారి నడవులకడవారిఁ
దనవారిగాఁ జేసికొనుట మఱియుఁ
దమ కనిసేయఁగాఁ దగుచోట మగుడి పో
వనువైనచోటుల నరయుటయును

గీ॥ దూత యొనరించుపను లింద్రు దూతజనుని
వలన నెఱుఁగంగ వలయును వైరిచర్యఁ
దనజనమ్ములయందును ధరణినాథుఁ
డరివరులదూతచేష్టల నరయ వలయు॥ 77

## దూతచరవికల్ప ప్రకరణము — దూతలక్షణము

ఉ॥ తలఁపున మించి క్లేశములు దాఁకి ప్రయాసము నోర్చి దక్షుఁడై
చెలఁగుచుఁ బోవ రాఁ గలిగి శీలముఁ జెంది పరేంగితంబు నూ
హలు దనలో నెఱింగి కఠినాత్ముఁడు గాక టుయుక్తి పెంపునన్
గలిగినవాఁడు దూత యనఁగా నుతికెక్కుచునుండు నెచ్చటన్॥

వ॥ ఇది దూతలక్షణం బగు నింకఁ జారలక్షణంబు వివరించెద. 79

### చారలక్షణము

కం॥ ముసలులును జారులు శిల్పులు
ననఁ దగి దిశలంచు ధూర్తులై తిరుగంగాఁ
దను వేగువారు వార్తల
ననువుగఁ దెలియుచును బలికి నవి తెల్పుటకై ॥ 80

చం॥ ఇలఁ గల చారకార్యముల నెల్లఁ గనుంగొనఁ జాలునట్టి క
న్నులు పతి కెంచు నెంచఁగ వినూతనచాతురిఁ బొల్చువేగువా
రలె కద కాన వారలు ధరాతలమందుఁ జరించుచు సర్వవా
ర్తలు దెలుపం జనుల్ లతిహితంబుగ వచ్చుచుఁ బోవుచుండఁగన్

చం॥ చెలఁగెడు సూక్ష్మసూత్రములచేత బలెం దనవేగువారిచే
నిలఁ గల సర్వవార్తలు మహీపతి దా నెఱుఁగంగ నొప్పు ని
ట్టులవునఁ జారచక్షుఁడయి యందము నొందినరాజు నిద్రచే
నలరినవేళ మేల్కనినయట్టివిధంబున మించు నెంచఁగన్॥ 82

గీ॥ కదలుటలచేత వ్యాపించు గాలిలీలఁ
గిరణములచేత వ్యాపించు తరణికరణి
నరపతికి లోకసమ్మతులైన వేగు
వారిచేతనె వ్యాపించవలయు జగము॥ 83

చం॥ కనుఁగొన వేగువారనెడి కన్నులుగల్గినవాఁడు గాఁదగన్
జనపతి వారిచేతనె దిశాతతియందుఁ జరింపుచుండఁగాఁ
జను నటు గాక మూఢుఁ డయి చారులచే నిల సంచరించకుం
డినఁ బడు నంధుఁడో యన వడిన్ సమమై తగునట్టి పట్టునన్ ॥

కం॥ వైరులకుఁ గలుగుసంపద
వైరులవర్తనలతెఱఁగు వైరులయవి యా
ధారుణి జనములకోరికె
సారెకుఁ బతి దెలియవలయుఁ జారులచేతన్ ॥ 85

వ॥ ఇట్టి చారులు ప్రకాశం బప్రకాశంబు నన రెండు దెఱంగులై యుండుదు రందుఁ బ్రకాశుండు దొలుతఁ జెప్పంబడిన దూత యనం బరగుచుండు, నప్రకాశుండై గూఢచారి యనం బరగు నంద్రు, యజ్ఞంబునందు ఋత్విజుండు సూత్రంబుచేతనే మెలఁగు చందంబుననరవరుండును జారులచేతనే ధరాతలంబునందెల్ల సంచరింప వలయు, నందుఁ దొలుతఁ జెప్పంబడినదూతచేతనే శత్రురాజుల సంధికార్యంబులు మొదలైనరహస్యప్రచారంబు లెల్లను దెలియ వలయును. గూఢచారులచేతనే శత్రురాజుల బాహ్యప్రచారంబు లెల్లనుదెలియ వలయు నిట్టి గూఢచారులు సంస్థులుసంచారులు నన రెండుదెఱంగులై యుండుదురు. అది యెట్లనఁ గ్రమంబున వివరించెద. 86

## సంస్థగూఢచార లక్షణము

సీ॥ ఒకరివారై పేరె యొకరివారగువారు
దాసర్ల రూపునఁ దనరువారు
సన్న్యాసులై కడు శాంతిఁ జెందినవారు
వేదముల్ సెప్పెడి విప్రవరులు

బహువేషధారులై పరగెడివారలు
మంత్రముల్ మంత్రించు మంత్రవిదులు
గుత్తకోర్లకు దున్నికొనియెడివారలు
కోమటులై యమ్మికొనెడివారు

గీ॥ సరకుచు వైరులపురములయందు నిలిచి
విభునిచేతను ధన మొంది వేగువారు
చాలసుఖలీలవేఁ దమచరుల కెల్ల
నొరిమ నాధారరీతుల నుండవలయు ॥ 87

గీ॥ ఇటుల శత్రుపురంబులం దెవుడు నిలిచి
యుండు సంస్థులయొద్దకు నొక్కచరుఁడు
పలుల దేశంబునందుఁ గొందఱను దఱుచు
పలయు విభునకు నవ్వార్తఁ దెలుపుటకును ॥ 88

వ॥ ఇట్లు దేశవార్తలరయం దిరిగెడివారు, పంచాలులు, తీక్ష్ణులు,
ప్రవ్రజితులు శస్త్రిలు, రసదులు, నను బరగుచుందురు.
వితత్ప్రకారం బెట్లన్నను 89

సంచారగూఢచారలక్షణము

సీ॥ అష్టఁబెట్టుచు సూళ్ళయందు గ్రాసముఁ జెంది
తీక్ష్ణులు జోగులై తిరుగుచుండ్రు
ప్రవ్రజితులపేరఁ బరగెడిచరులు స
న్యాసివేషాధుల నంది యుండ్రు
శస్త్రవైద్యముఁ జేసి చరియింపుచురు కొంద
అఖిలభూముల శస్త్రి లనెడివారు
రసవైద్యములు చేసి రసికులై తగు చుండ్రు
రసదులపేరింటఁ బొసఁగు వారి

గీ॥ అవనిపతి యిట్లు తిరిగెడియట్టిచార
నొకొక్కరొక్కరిగుఱుతులు నొకొక్కరొకరు
తెలియకుండఁగఁ బంపఁగా వలయు నెపుడుఁ
బరువుకొని యంద తోకరీతిఁ బలుకకుండ ॥ 90

చం॥ తనయెడ శత్రునందు నవధానముతోఁ బతిఁ బాని చేయఁగా
ననువగు యత్నముల్ మనసునందు నెఱుంగని యట్టిపుంపరా
జనిశము నిద్రఁబోనియతిఁ దైనను నిద్దురఁ జెందువాఁడె యై
దనఁ దగు మేల్కనన్ బొరయుఁ గానను దా మితిప్రమత్తుఁ డన్ధరన్

సీ॥ కారణం బేమియుఁ గలుగక కోపించు
వారల దండింప వలయు నెపుడు
కారణంబులఁ గోపగతిఁ జెందువారలఁ
దనవారిగాఁ జేసికొనఁగ వలయు
పరికిఁ బ్రవేశింప నరి నందు గావునఁ
దనయందుఁ గలుగు ఛిద్రమును దెలిసి
దానమానములచేఁ దా మాన్పఁగాఁ దగు
నల రాజ్యకంటకులైనవారి

గీ॥ మొగము లెంతయుఁ జెదరఁగా మొత్త వలయు
జనవిభుం డిట్లు మిగుల నెచ్చరిక గల్గి
యపరికైనట్టి సామదానముల నందు
పడి చెడినభూమి నిండింపఁ బాడి యంద్రు ॥ 92

కం॥ ఇంచుక సం దొనఁగూడిన
మించినరిపురాజ్య మాక్రమించఁగఁ దగు దా
జించుక సం దొనఁగూడిన
మించి జలము కలము నాక్రమించినరీతిన్ ॥ 93

వ॥ మఱియు నందులలోనిభేదంబు లెనయం దగి శత్రురాజుల యంతఃపురవార్తలెఱుంగఁజేయు వేగులవారివిధం బెట్లన్నను.

సీ॥ కాననివారలకై వడి వినకుండు
వానిరీతుల మూఁగవానికరణి
మెలఁగువారు నపుంసకులు జడవేషులు
గూనుబోయినవారు గుఱుచవార
లటువంటిరీతుల యాకారములు గల్గు
కాయలు పండ్లమ్మఁబోయవారు
చాకలవాండు బిచ్చాలవారలు నట్టు
వలు మెఱి శిల్పముల్ గలుగువార

గీ॥ లింతి బిడ్డలు బూటింద లిచ్చువారు
విమతరాజులయంతఃపురములలోని
వార్త లెల్లను దెలియంగ వలయు నెపుడు
వేగువారలు గుఱిఁగానివిధముతోడ॥ 95

గీ॥ గొడుగులును గిండ్లు సురటులు గత్తములును
బట్టువారలు పల్లకీ ల్వట్టువారు
నగుచు వేగులవారలు పొగడవార్త
వెలిని గలవార్తఁ దెలుపఁగా వలయుఁ బతికి॥ 96

సీ॥ పంటలవారలు వైద్యులు తపసులు
జ్యౌతిషికుల్ వ్రతుల్ హాస్యపరులు
నాంధ్రవారలు నీళ్ల నందించు వారలు
జెట్టులు భుజియింపఁ బెట్టువారు

పీడెముల్ సొమ్ములు విరు లొసంగెడివారు
కలపముల్ గూరిచి యలఁదువారు
సింగారములు సేయు సంగడికాండ్రును
నాపతీర్థమువారు సామువారు

గీ॥ నాదియగువారి శత్రులయంద నిలిపి
యింగితాదుల నితరు లెఱుంగనీక
దాయ కెందును రసమిడఁ జేయవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 97

చం॥ పసుపడ నింగితాకృతుల భాషల నన్య లెఱుంగకుండ నే
ర్పున మును బందుకట్టినలిపుల్గల కమ్మలచేత శత్రుప
త్రనముల నొందొరుల్ గడుఁ దిరంబగురీతి నెఱింగ చేసెవా
రనుపుగఁ దెల్పఁగాఁ దగు ధరాధిపవర్యున కాప్తులై తగన్ ॥

చం॥ రవికిరణంబు లెల్లెడల రాజిలి నీరముఁ బీల్చుకై వడిన్
భువిఁ గల వార్త లెల్లఁ దమబుద్ధిబలంబున సంగ్రహింపుచున్
వివరముతో రహస్యగతి వేగులవారు చరింపఁగాఁ దగున్
వివిధములైన వేషములు విద్యలు శిల్పములుం బొసంగఁగన్ ॥

కం॥ ఏరీతి సిరులకొఱకై
పైరులఁ దా నాక్రమించు వారు నటులనే
వేరి యొనర్చు నుపాయ ము
దారగతిం దెలియ వలయు ధరణీపతిరన్ ॥ 100

శా॥ లక్ష్మీసంయుతనీతివిక్రమకళాలంకార లంకారవా
సాత్మప్రాభవ రామభద్రసుగుణస్తోత్రోల్లసన్మంత్ర మం
త్ర జ్ఞరక్షణదీక్ష దక్షవిమతప్రఖ్యాతశౌర్యక్రియా
లక్ష్మప్రస్తుతచార చారవరజాలజ్ఞాతవార్తోజ్వలా ! ॥ 101

కం॥ శ్రీ కర్ణాటాధిపద
త్తాకలితనవీనచామరాదికనృపచి
హ్నాకల్పవరశుభాంకా!
శ్రీకరమహనీయరూపజితమకరాంకా! ॥ 102

తరలము॥ వినయహార! సనయచార విదిత ధీరమండలీ
వినుతిహార కీర్తిపూర విజిత తారకా శర
ద్వనదవార! మథిత ఘోరవైరి వీరశౌర్య ఖే
లన గభీర గుణవిహార లలితశూర సేవితా॥ 103

గద్యము॥ ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భా
ద్వాజసగోత్ర జక్కరాజు ఎల్లనామాత్యపుత్ర సుకవిజన విధేయ
శ్రీరామకృష్ణ భక్తివైభవ భాగధేయ వెంకటనామధేయ ప్రణీతం
బైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు మంత్రి
ప్రభావంబును, మాతచారస్వభావంబు నున్నది పంచమాశ్వాసము.

# ఆంధ్ర కామందకము

## షష్ఠాశ్వాసము

క॥ శ్రీదశరథ నృపనందన
పాదాబ్జస్మరణకరణపటుమానస స
మ్మోదితసజ్జనవిదితన
యాధిక కొండ్రాజువెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### ఉత్సాహప్రశంసా ప్రకరణము

ఉ॥ శ్రీరమణీయుఁడై నృపతిశేఖరుఁ డన్నిట బుద్ధిమంతుఁడై
చారులచర్యచే నెపుడు శత్రులబల్మి యెఱింగి యెంతయుం
గౌరవ మెంచ దూతలముఖంబునఁ గార్యము గానిపిమ్మటన్
వైరుల ఖేదపెట్టుచు నవారితలీలల దండు వోఁ దగున్ ॥ 3

క॥ సమకొనుప్రయత్నమును స
త్త్వము చెందుచు సూక్ష్మధారఁ దగి నిల్కడయై
యమరినమతి ఫలసిద్ధిం
గ్రమమునఁ గను నరణి యగ్నిఁ గనుచందమునన్ ॥ 4

ఉ॥ తేగురుతాలఁ గుందనముఁ జెందినమాడ్కి దధిన్మథించినన్
వేగమె వెన్నవుట్టుసరణిన్ వరబుద్ధిసమేతయత్నసం
యోగముగల్గి నిల్కడల నొందుచు నుండెడు నట్టి మంచి యు
ద్యోగముచేత నెల్లపుడు నొందు ఫలంబులు నిశ్చయంబుగన్ ॥

కం॥ అల యుత్సాహము బుద్ధియుఁ
జెలఁగగ నుద్యోగియైనక్షితిపతి యిలలో
పల సిరులకు నిలుకడ యగు
జలములకును బెంకియైన జలనిధివోలెన్ ॥ 6

కం॥ జలములచేఁ బాలితమగు
జలధినిగతి బుద్ధిచేత సంపదఁ బ్రోవన్
బలయును యుత్సోత్సాహ
మ్ములచే నది యెవ్వరు ప్రబలముగఁ జేయఁదగున్ ॥ 7

మ॥ ఇల నుత్సాహగుణంబునం బొదలి తా నెవ్వేళలన్ బుద్ధిచే
మెలఁగం జాలినయట్టి రాజుపలన న్మేలౌ సిరుల్వాసి పో
కలదు న్మేనులతోడ నీడ చెదబాయం జాలకున్నట్టిలీ
లల విస్తారముఁ జెందుచుండు నవి చాల న్నిక్కి పెంపెక్కుచున్ ॥

కం॥ అలయక వ్యసనములకుఁ గడుఁ
దలఁగుచు నుత్సాహమతులఁ దనరెడువిభునిన్
బలుసిరులు తామె చెందున్
జలనిధిలో నదులు చెందుచందం బందన్ ॥ 9

కం॥ జనపతి మతిఁగలిగియు దా
ననిశము వ్యసనములచేత నలసుండై సన్
వనసిరులు దన్ను విడుచును
వనితలు లేపంబులేనివానిం బోలెన్ ॥ 10

మ॥ ఘనమౌ కట్టియచేత నగ్ని బలియంగాఁ జేయుచందంబునన్
దనయుత్సాహముచేత సత్త్వమభివృద్ధంబై కనం జేయఁగాఁ
జను నిద్ధారుణి నట్లకా విలసితోత్సాహంబు నిత్యంబు జెం
దిన యామర్త్యులుఁడున్ సిరిం గని సముద్దీపించుఁ జంచద్గతిన్ ॥

మ॥ తలఁపఁ సంపద నెల్ల ధూ ర్తయగు కాంతంబోలె భూజాని ని
చ్చలుఁదాఁ-బౌరుషయుక్తుఁడై యనుభవించంగోరియత్నంబు భూ
స్థలిఁ జెందం దగు నిల్లుగాక మఱి యుత్సాహంబుతోఁ బాయుచుఁ
వలదెవ్వేళ నపుంసకుంబులబె సుంతంగా మహీభర్తఁ॥ 12

కం॥ అందంద ధూర్తయై తగు
మందగమనఁ గూడునట్లు మఱి సిరి దగుఁ బో
యెందు నల సింహవృత్తిఁ
ముందల వట్టీడ్చి తెచ్చి ముదమును జెందుఁ॥ 13

చం॥ ధళధళమంచు మించులను దార్కొను సారకిరీటరత్నపం
క్తులఁ దులలేనిచిత్రములతోఁ దగువైరిశిరంబులంబు ని
చ్చలుఁ జలమెచ్చఁ బాద మవిషాదముగా నిడుచుండెనేని రే
పలవలమానమానసుఁ దవశ్యము దా శుభ మంద నేర్చునే॥ 14

కం॥ పసగల యుద్యోగముచే
నెసగొలిపెడు చిత్తమునెడిమేసుఁగుచే స
ప్వసుమతిఁ బరులను దరువుల
వెస గడపక నృపతి కెంచు విభవము గలదే॥ 15

చం॥ చెనకినవైరిపైఁ జికిలిచేసిన భాసిలుపెద్దకత్తి దూ
సిన జనియించు చాయలు విచిత్రములై మదహస్తిహస్త ఖే
లనకరదండయుగ్మమున లావునఁ బట్టినఁ జిక్కుఁగాక మిం
చిన ఘనరాజ్యలక్ష్మి దనచేతికి నూఱక చిక్కదక్కనే॥ 16

ఉ॥ ఉన్నతమై చెలంగు పద మొందఁ దలంచినయట్టివాఁడు దా
నున్నతమై చెలంగు పదమొందుచునుండును, గాక నీచమై
యున్న పదంబుఁ గోరుకొనుచుండెడినీచుఁడు చెందు నీచమై
యున్న పదంబుఁ దాఁ బడుట నొందెడు శంకదొలంక నెల్లచోఁ॥

మ॥ తనకంటెన్ బొడవైనయేనుఁగులమీఁదన్ విక్రమంబొప్పఁ జెం
గన సింగంబు పదంబుఁ బెట్టుగతి రాజాగ్రేసరుండెల్లచోఁ
దన యుత్సాహముచేత విక్రమముచేత న్మించ నత్యున్నతిన్
ఘనమైనట్టిపదంబుఁ గైకొను ధరాకాంతుల్ నుతుల్ సేయఁగన్॥

కం॥ భయమెదలిన పామొరులకు
భయమూగఁ దనపడగఁ జూపు దాగునఁ బతియున్
భయమునఁ బొరయనివాఁడై
నయగతిఁ దేజంబుఁ జూప నాయం బెందున్ ॥ 19

వ॥ ఇది యుత్సాహ ప్రకరణం బింక స్వామ్యాది సప్తాంగంబులకుఁ
గల ప్రయోజనంబులును, వ్యసనంబులునుం గ్రమంబున
వివరించెద నందు రాజప్రయోజన మెట్లనిన. 20

ప్రకృతికర్మ ప్రకరణము — రాజచర్య

సీ॥ విద్యలన్నియు జెప్ప విని యర్థము లెఱింగి
వర్ణాశ్రమంబుల వరుసఁ బ్రోచి
శస్త్రశాస్త్రంబులచందముల్ గనుఁగొని
యనిసేయునేర్పుల నభ్యసించి
యలవుమై నెపుడు వాహ్యాళి వెళ్ళగ నోపి
కార్యపద్ధతుల సంగతులు దెలిసి
రథములఁ గరులఁ బోరగ నేర్చి యెంతయు
బాహుయుద్ధమురీతి పదిలపఱచి

ఆ॥వె॥ మాయలెఱిఁగి పరుల మనసులు గనుగొని
కైదువుల పరీక్షఁ గనఁగఁ జాలి
సకలజనులు మెచ్చ జయపెట్టి మెలఁగుట
రాజచర్యలివి ధరాతలమున ॥ 21

సీ॥ మంచివారికినెల్ల మంచివాఁడగుటయు
ధూర్తుల యెడఁ గడు ధూర్తగుటయు
సామదానంబులచందంబు భేదంబు
దండం బుపేక్షయుఁ దగ నెఱుగుట
మంత్రవిచారంబు మఱవక సేయుట
మంత్రమార్గమున సమ్మతి మెలఁగుట
మంత్రంబు రక్షించి మంత్రస్థిరుం డౌట
దుష్టజనంబుఁ బోఁ దోలుటయును

గీ॥ పతియు దళవాయు లధికార్లు మంత్రివరు ల
మాత్యులుఁ బురోహితాదులు నిత్యలీల
మెలఁగుపగతు లన్నియును లెస్స దెలియుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 22

సీ॥ అరసి యమాత్యాదు లైనట్టి సప్తాంగ
మందలివ్యసనంబు లడఁచుటయును
కోపమందినవారి కోపంబు మాన్పుట
గురువు చెప్పినబుద్ధిఁ దిరుగుటయును
పూజార్హులగువారిఁ బూజింప నేర్చుట
ధర్మాసనము పెట్టి తప్పకుంట
రాజ్యబాధకులను బ్రహరించుటయు బంట్లు
జీతముల్ చెందుట చెందకుంట

గీ॥ చేసినవి సేయనివి పరీక్షించి యుంట
యెప్పుడు పేదరికంబున నెనయువారిఁ
గలిమిగలయట్టివారిని దెలియుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 23

సీ॥ మధ్యమోదాసీనమానవేశుల మార్గ
మరసి వారల సంధియందుటయును
వచ్చువారిని బోవువారి నెఱుంగుట
హితులఁ గూర్చుట వైరితతి నడఁచుట
యాంధ్ర బిడ్డల నెన్న యరసి రక్షించుట
నలుదిక్కులకును దూతలఁ బనుచుట
తనకు జీవనములై తగు గనుల్ పసులును
గరులును గృషులాది గాఁగఁ గల్గ

గీ॥ నట్టి వన్నియుఁ జేకూర్చి యలరుటయును
దుష్టులగునట్టివారలఁ ద్రోయుటయును
మంచివారలఁ జేపట్టి మించుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 24

సీ॥ సర్పతంతువుల హింసలు చేయకుండుట
యెందు నధర్మంబుఁ జెందమియును
మంచికార్యము లొనరించగాఁ బూనుట
దుష్టవాక్యములెల్లఁ ద్రోచియుంట
యియ్యంగఁ దగుచోట నియ్యంగ నేర్చుట
పుచ్చుకోఁ దగుచోటఁ బుచ్చుకొనుట
దండించఁ దగనిచో దండించకుండుట
దండార్హులగువారిఁ జెందుటయును

గీ॥ దెలియఁ దగినవి తెలియుట, తెలియఁదగని
యర్థములు విడుచుటయు, నిరర్థకములు
మాను టర్థంబుగలయవి పూనుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 25

సీ॥ అరిఁగోర్ల నెపుడు న్యాయంబుగాఁ గొనుటయు
నెఱిఁగి న్యాయంబుగా నిచ్చుటయును
దనప్రధానజనంబు ఘనముగాఁ బ్రోచుట
వినువగాఁ దగువారి విడుచుటయును
వైరంబు లడఁగించి వర్తించుటయు బంట్ల
తోడి విరుద్ధంబుఁ ద్రోయుటెందు
నెఱుఁగకుండిన యర్థ మెఱుఁగఁగా నేర్చుట
యెఱిఁగి యర్థము నిశ్చయించుటయును

గీ॥ సకలకార్యంబులందును జతురుఁడగుచుఁ
బూనిసేయుచు నుండుట, బూనినట్టి
పనులఁ గడవెళ్ళఁగాఁ జేసి పరఁగుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 26

సీ॥ నీతి మించఁగఁ జెందనిది చెందఁగోరుట
చెందిన దభివృద్ధిచేసికొనుట
యభివృద్ధిచెందినయర్థంబు శాస్త్రోక్త
మగురీతి సత్పాత్రమందు నిడుట
మఱియు నధర్మముల్ మాన్పుట యనునీతి
వినువ కెవ్వేళల నడచు టెందు
నుపకారయోగ్యులై యుండెడువారికి
నుపకారములు సేయుచుండుటయును

గీ॥ ధర్మ మెప్పుడు ధనముగా దాఁచికొనుట
యెంచఁదగుఁ గీర్తి మించి వర్తించుటయును
దైవమును బ్రాపు దాపుగాఁ దలఁచికొనుట
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 27

వ॥ అమాత్యప్రయోజనము. 28

## మంత్రి చర్య

సీ॥ ఆదాయములు గల్గు హరువుఁ గల్పించుట
యెఱిఁగి వెచ్చంబు సేయించుటయును
పైకొని పగవారి రాకుండఁ జేయుట
క్షితిపతి నెపుడుఁ బోషించుటయును
దండనీతియును మంత్రంబు నెఱుంగుట
యెఱిఁగి మంత్రఫలంబు నెనయుటయును
వ్యసనముల్ రాకుండ వర్తింప నేర్చుట
లెస్సగా భూమిఁ గాలించుటయును
గీ॥ మీఁదిట ఫలంబు గలుగఁ దా మెలఁగి చెలఁగు
టాదిగాఁ గల్గియుండెడునట్టి వెల్ల
మంత్రిజనములపనులండ్రు మహిఁ దలంప
నిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 29

వ॥ రాష్ట్ర ప్రయోజనము. 30

## రాష్ట్ర చర్య

కం॥ బలమును భండారము ధన
ములు వాహనములును ధాన్యములు తృణకాష్ఠం
బులు మొదలగువస్తుతతుల్
గలిగించుట రాష్ట్రమునకుఁ గల పను లరయన్ ॥ 31

వ॥ దుర్గప్రయోజనము. 32

## దుర్గచర్య

సీ॥ ఆపద తఱిఁ బ్రజ కాశ్రయంబగుటయు
భండారమున కున్కిపట్టగుటయు

నఖిలదేశంబులయందు నుండెడివార
లేయెడ నిలుకడ నెనయుటయును
బరులకుఁ బోట్లాట బాగుగాకుంటుట
ఘనమైనవిజయంబు గనఁగలుగుట
శత్రుల మిత్రుల సమకూర్పఁ గలుగుట
బలముల రక్షించఁ గలుగుటయును

గీ॥ గడిదొరలచేత మఱి పాలెగాండ్రచేతఁ
బీడఁ బొరయక యెందును బెంపుఁగనుట
మొదలుగాఁగల్గు నివి దుర్గమునకు బనులు
నృపతి యీమార్గముల నెల్ల నెఱుఁగవలయు ॥ 33

వ॥ బలప్రయోజనము. 34

బలచర్య

సీ॥ విమతులఁ జెండాడి విజయంబుఁ గనుటయు
మిత్రులఁజేకూర్చి మెలఁగుటయును
జగతి నెంతేనియు సాధింపఁగలుగుట
ధనముల నార్జించి తనరుటయును
దూరకార్యముల నెందును వేగచేయుట
చెందినదాని రక్షించుకొనుట
నిజబలతతుల నెన్నికమీఱఁ గూర్చుట
పరచక్రములఁ గీడుపఱచకుండు

గీ॥ టాదిగాఁగల్గుచుండెడు నట్టి వెల్ల
ప్రాజ్ఞులగువారు బలములపనులటందు
రిట్టి మార్గంబు లెల్లఁ దా నెఱుఁగవలయు
పీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 38

వ॥ మిత్రప్రయోజనము. 36

### సుహృచ్చర్య

సీ॥ పగవారలను మట్టుపడియుండఁ జేయుట
మంచిమిత్రులఁ బ్రబలించుటయును
భండారములచేత బలములచేతను
క్షితిచేతఁ బ్రాణంబుచేతనైన
నెల సుపకారములే చాలఁ జేయుట
మిగులనెయ్యంబుతో మించుటయును
గణుతింపఁ బ్రత్యుపకారంబుఁ గోరక
మంచికార్యములు సాధించుకొనుట

గీ॥ యాపదలయందు మిగుల సహాయుఁడగుట
సంపదలు చెందియుండిన సంతసిలుట
యరయ మిత్రుని పనులంద్రు ధరణినాథుఁ
డిట్టి రాజ్యాంగముల పనులెఱుఁగవలయు ॥ 37

వ॥ వ్యసనములకు. 38

### ప్రకృతి వ్యసనములు

ఆ॥వె॥ ఎందుచేత శుభము లెప్పుడు చెడిపోవు
నదియ తలఁప వ్యసన మనఁగఁ బరగు
వ్యసనియైనవాఁడు వెస నధోగతిఁ బడు
నటులఁగాన వ్యసన మడఁప వలయు ॥ 39

కం॥ దైవంబును మానుషమును
దైవము మానుషము రెండు దగులుటచే సం
భావితమగు వ్యసనము తా
భావరుఁ దిదిమాన్పి దండుపోవఁగ వలయున్ ॥ 40

కం॥ జలమును దెవులును మారియు
నల దుర్భిక్షంబు చిచ్చు ననునైదు తెఱం
గుల వెలయు నెందుదైవిక
ములైన వ్యసనంబు లితరములు మానుషముల్ ॥ 41

కం॥ పౌరుషమున శాంతులచే
సారె విధుఁడు దైవికవ్యసన ముడుపఁ దగుఁ
బౌరుషముచేత నీతివి
చారముచే మానుషవ్యసన ముడుపఁదగుఁ ॥ 42

వ॥ రాజవ్యసనము. 43

కం॥ అతినిష్ఠురమగుమాటయు
నతిదండము వేఁట పాన మతిపయుం జూదం
బతిఘనమగుదుర్వ్యయమును
క్షితి నివి వ్యసనంబు లండ్రు క్షితిపతి కెంచన్ ॥ 44

గీ॥ నిరత ముద్యోగవంతుఁడై నీతి నలరు
రాజు రాజ్యాంగముల నెల్లఁ బ్రబలఁజేయు
నటులఁగాకెందు వ్యసనార్తుఁడయ్యె నేని
తనదు రాజ్యాంగములనెల్ల తలఁకఁ జేయు ॥ 45

కం॥ అలధర్మార్థంబుల నా
కులుఁడగుచో మనసు దొట్రుకొని చెదరినచో
నిలతేనికి సన్మంత్రులు
దెలుపఁగఁదగు రాజచర్య ధీరత చెందన్ ॥ 46

వ॥ మంత్రివ్యసనము. 47

కం॥ అలసత జాడ్యము గర్వము
గలహము దెచ్చుట ప్రమాదగతి యుద్ధతియుఁ
బలువగు సప్తవ్యసనం
బులు మంత్రుల కెందు వ్యసనములు ధరలోనన్ ॥ 48

కం॥ తనమంత్రిజనము వ్యసనము
గనినయెడ న్విభుఁడు శక్తిఁ గలిగినవాఁడై
యున్న తెక్కలి విఱిగిన పులుఁ
గనగాఁ బొడమై నపదవి నందికయుండున్ ॥ 49

వ॥ భండారవ్యసనము. 50

ఉ॥ దూరమునందె యుండుటయు దొంగలచేఁ బడిపోవు టెంతయుం
దీరఁగ వెచ్చమౌట చెదదింటయుఁ దెక్కసచ్చోట్లమున్క నిం
దారగఁగూడఁబెట్టమి యనాదర భావముతోడ నున్క భం
డారమునందునుండు వ్యసనమ్ములగున్ ధరణీతలంబునన్ ॥ 51

కం॥ వసుధన్ భండారమునకు
వ్యసనంబులు చెందెనేని యందగు వసులుం
బొసఁగవు గన భండారము
వ్యసనము మాన్పంగవలె నవశ్యము పతికిన్ ॥ 52

కం॥ ధరభండారమె మూలము
నరపతి కని నీతిపరులనంగా వినుటన్
దొర యెప్పుడు భండారము
గరిమ మెయిం బ్రబలుచుండగాఁ జేయఁదగున్ ॥ 53

వ॥ రాష్ట్రవ్యసనము. 54

చం॥ ఎలుకలు చిల్కలు న్మిడుత తెచ్చెగువాసలు వానలేమి దొం
గలు ప్రతిమూకలుం జనవు గల్గినవారల బాధ శత్రుమూఁ

కలు బసి చచ్చుటల్ దెవులు గ్రమ్ముట భూపతిచేతిభంగముల్
బలువగు మారిసందుగకుఁ బట్టుటయుణ వ్యసనంబుభూమికిణ ॥

గీ॥ పాశుపాల్యంబు గృషియును బణ్య మనఁగ
బరగువార్తనె ప్రజలెల్లఁ బ్రతుకు చుంద్రు
వారు వ్యసనంబు చెందిన వారు సేయు
పనులుచేకూడ వంద్రు భూపతికి నెందు ॥ 56

వ॥ దుర్గవ్యసనము. 57

కం॥ కసవును గట్టెలు వసము
బసలేకుంపుటయుఁ గోటపడుట యగడ్తల్
రసములు యంత్రాయుధములు
నెసఁగమి దుర్గమున కెల్ల నివి వ్యసనంబుల్ ॥ 58

కం॥ ధర దుర్గమునకు వ్యసనము
పరగిన దుర్గంబు పనులు పసచెడు నివిలే
కిరవగు దుర్గముగల చోర
యరులకు మిత్రులకుఁ బూజ్యుఁడగు నెవ్వేళణ ॥ 59

వ॥ బలవ్యసనంబులు. 60

వ॥ మఱియు వ్యసనయుక్తంబులగు బలంబులు పరిక్షిప్తంబును, విమానితంబును, వ్యాధితంబును, మారాగతంబును, బరిక్షీణంబును, సభూయిష్టబలంబును, నవిక్షిప్తంబును, నంతశ్శల్యంబును, భిన్నగర్భంబును, నపసృతంబును, బరిమృష్టంబును మిశ్రంబును, నుపనివిష్టంబును, శూన్యబలంబును, మిత్రవిక్షిప్తంబును, బ్రహతాగ్రజనంబును, నస్వామిసంహితంబును, భిన్నకూటంబును, దుష్పార్ష్ణిగ్రాహంబును, సంధంబును, విచ్ఛిన్న వీవధాసారంబును, నుపరుద్ధంబును, నమానితంబును, శూన్య

మూలంబును, సభృతంబును, బరిక్రాంతంబును, సమాగతంబును, ప్రతిహతంబును, స్వవిక్షిప్తంబును, గ్రుద్ధమూలంబును, ససృత సంప్రాప్తియు, గళత్రగర్భంబును, నాశాసిద్వేదియు, దూష్య యుక్తంబు నననివి ముప్పదినాలుగు తెఱంగులై యుండు నందు వ్యసనంబులు పరిహరింపరానివి యిరువది యొక్కటియును, వ్యసనంబులు పరిహరించవచ్చునవి పదమూడును గలవు. తత్ప్రకారంబు వివరించెద. 61

పరిక్షిప్తాది బలలక్షణము

సీ॥ అరిచుట్టుముట్టిన నటుత్రోవ గానక
చిక్కియుండినఁ బరిక్షిప్తబలము
జనపతిచేఁ దిరస్కారంబు గనుఁజెంది
మదిరోషమంది విమానితంబు
నతిరోగములచేత నలసి యేపనులకు
నసమర్థమైనచో వ్యాధితంబు
నతిదూరగతిచేత మృతిఁజెందుగతి నా
ధావళి విడుచు దూరాగతంబు

గీ॥ గట్టముల శూరులును మును గూలిపోవ
క్షీణమైయుండు నల పరిక్షీణ బలము
వ్యసనమును జెంది ముడుఁగుచున్నట్టికలన
బతికినప్పటి కనిసేయఁ బనికిరాదు ॥ 62

సీ॥ అనిసేయ నిట్టట్టు చనరాక యిఱుకున
మెలఁగఁ గూడని యభూయిష్ఠబలము
బహుదేశముల కడపటనుండి వేళకుఁ
జేరనేరని యవిక్షిప్తబలము

ఏపిమూఁకలోన నెంతయు శత్రులుండిన
సదరు నంతశ్శల్య మనుబలంబు
సర్వోన్య కలహంబు నంది యైక్యముగాని
భిన్నగర్భంబను పేరిబలము

గీ॥ నొక్కరి ప్రదేశము వ్వల నుండి చేర
సనువుగానక యుండిన నపసృతంబు
వ్యసనమును జెంది ముడుఁగుచున్నట్టి కతనఁ
బతికినప్పటి కనిసేయఁ బనికిరాదు ॥ 63

సీ॥ పిఱికిపంతంబునఁ బెగడెదుదశవాయి
నౌనగూడుఁబరిమృష్టమనుబలంబు
విపత్తిసైన్యముగూడి విడిసియుండుటఁజేసి
మించి రానేరని మిత్రబలము
ముసుశత్రుల సమీపములనుండి యేతెంచు
నుపనివిష్టంబన నొప్పుబలము
తరతరంబును గొల్చి తగు ప్రాఁతమూఁకలై
శూరత గల్గని శూన్యబలము

గీ॥ సదరిమిత్రసహాయార్థమనిపినట్టి
మిత్రవిక్షిప్తమని మొనమేటి భటులు
చాలఁగూలినఁ బ్రహతాగ్రజనబలంబుఁ
బతికి నప్పటికనిసేయఁ బనికిరాదు ॥ 64

సీ॥ అధిపులతోఁ బాసియాధారమెదలిన
యస్వామిసంహిత మనెడి బలము
నధిపులు గూలిన యప్పు దొండొరులకుఁ
గూటమొందని భిన్నకూటబలము

వెనుక శత్రులచేత వెతఁజెందు మహాపార్ష్ణి
గ్రాహమను పేరఁగలబలంబు
జగడంబులోన నెచ్చరికెకాఁడెదలిన
నటు ముందుఁ గానని యంధబలము

గీ॥ ధాన్యసంప్రాప్తి చుట్టముల్ దనకు రాక
జడియువిచ్ఛిన్నవీవధాసారబలము
వ్యసనములయందె ముదుఁగుచు న్నట్టికతనఁ
బతికి నప్పటి కనిసేయఁ బనికిరాదు ॥ 65

వ॥ ఇంత వ్యసనంబులు పరిహరించి యనికిం బనికివచ్చు బలంబు
లెవ్వియనిన. 66

బలవ్యసన పరిహార విధానము

సీ॥ రిపులు మార్గము గట్టి నుపరుద్ధ మది పెర
త్రోవ నేతెంచిన దుర యొనర్చు
బహుమాన మొందని బలమమానిత మగు
నది యిచ్చి మన్నించ నని యొనర్చు
నిండఁగాఁ దాపులేనిది శూన్యమూలమౌ
నది తాపుగల్పించ నని యొనర్చు
సభృతంబు జీతంబు నందకుండినబలం
బదిజీత మిచ్చిన నని యొనర్చు

గీ॥ నలసి యున్నఁ బరిశ్రాంత మనఁగ బరగు
నలయికలు దీర్చనదియును నని యొనర్చు
నిట్టిబలముల వ్యసనంబు లిటుల మాన్పఁ
బనికి వచ్చును మగుడ భూపాలునకును ॥ 67

సీ॥ అడిగిన నీకున్న నాళచేవెతఁజెందు
నాళావిని ర్వేదియనెడి సైన్య
మది యడిగిన దెల్ల నవ్వు డాసంగిన
నది బలంబులఁగూర్చి యని యొసప్పు
దూష్యలతోఁగూడ దూష్యయుక్త మటంద్రు
తద్దూష్యలగువారిఁ దలఁగ ననిచి
యైన నాప్తులు సూరులగువారితోఁ గూర్చి
యనికిఁ బంచినసైన నని యొనట్టు
గీ॥ సధికమగునేర్పు లీరీతి నాత్మనెఱఁగి
తనకు విజయంబు చేకూరఁ దలఁచెనేని
యిటుల బలముల వ్యసనంబు లెల్లమాన్పఁ
బనికివచ్చును మగుడి భూపాలునకును ॥ 68

కం॥ బలముల వ్యసనము లీగతి
నలవునఁ దా మాన్పఁడేని యందునఁ బరుఁడా
గలుగఁగ నేరవు గావున
బలముల వ్యసనములు మాన్చు పతి జయమొందున్ ॥ 69

వ॥ ఇంక మిత్ర వ్యసనము. 70

కం॥ ఇల సప్తవ్యసనంబుల
వలనం జనియించునట్టి వ్యసనంబులు పై
రులచే నొచ్చుట దైవము
వలనన్ జెను టివ్వి మిత్రవ్యసనము లరయన్ ॥ 71

కం॥ మిత్రుఁడు వ్యసనము నందిన
మిత్రుఁడు చేకూర్చుపనులు మిగులఁగఁ జెడుఁ ద
న్మిత్రుని వ్యసనము మాన్చిన
ధాత్రీపతి యెట్టిచోఁ దా జయమందున్ ॥ 72

గీ॥ ధరణి రాజ్యాంగముల యందుఁ దగులు నిట్టి
వ్యసనములు మాన్పఁగాఁ దగు నద నెఱింగి
యుటుల మాన్పక మదమున నెనయు భూమి
పాలుఁ డరిరాజుచేఁ బరాభవము నెందు ॥ 73

వ॥ ఇట్లు రాజు మొదలుగాఁ బలుకంబడిన యంగంబులందుఁ బ్రాప్తంబులైన వ్యసనంబులలోన మొదట మొదటఁ జెప్పంబడిన యంగంబుల వ్యసనంబులే గురుతరంబులగుచు నుండుఁ గావున. 74

సప్తవ్యసనవర్గ ప్రకరణము.

కం॥ నరపతి దా వ్యసనంబులఁ
బొరయనిచో రాజ్యమెల్లఁ బోపగ నోపుఁ
నరపతి వ్యసనము చెందిన
పరయుచు రక్షింప రాజ్య మసమర్థ మగుఁ ॥ 75

కం॥ తన సచివుని ప్రజ దుర్గం
బును భండారంబు సైన్యమును జుట్టము నెం
దును వ్యసన మందకుండగ
మనిచిన జనపతి త్రివర్గ మహిమఁ జెందుఁ ॥ 76

తే॥వె॥ శాస్త్రదృష్టిలేని జననాయకుని నంధుఁ
డనుచు నండ్రు ప్రాజ్ఞులైనవారు
అంతకంటె నంధుఁడగుచ దివియును గ
ర్వమున నుంచినదక వదలునతఁడు ॥ 77

కం॥ జనపతి యంధుం డగుచో
ననువగు మార్గంబు మంత్రులందింతు రిలఁ
మును జదివి మత్తుఁడైనఁ
దనతోఁ గూడంగఁ బ్రకృతితతి చెడఁజేయుఁ ॥ 78

కం॥ కావున నమాత్యమతమున
సేవలనను మెలఁగి శాస్త్రదృష్టి వెలయఁగా
దా విడువవలయు వ్యసనము
లావల ధర్మార్థహాని యడరక యుండన్ ॥ 79

## సప్తవ్యసనములు

చం॥ పలుకుల వెట్టి యర్థములు పారగపైచుట యెక్కు దాక్షిణ్యం
గలయవి క్రోధజంబులయి కన్పడుచుండు ధరాతలంబునన్
వెలఁదియు మద్యపానమును వేఁటయు జూదముఁ గామజంబులై
నలువు దలిర్చు నిట్టి వ్యసనంబులు భూపతి మానఁగాఁదగున్ ॥

వ॥ అది యెట్లనినను దత్ప్రకారంబు క్రమంబున వివరించెద
వాక్పారుష్యమునకు. 81

కం॥ వేఱుపొసఁగి నిరర్థకమై
కఱకరిగలపలుకు బలుకగా దెప్పరితో
మఱి పగఱను మృదువాక్యమె
మఱవక దనవారిఁ జేసి మనఁగా వలయున్ ॥ 82

కం॥ కారణములేకయే వా
క్పారుష్యము వెలయుఁ గ్రోధగతిఁ బలికెడు నా
క్రూరునకు వెఱచు లోకం
బారయ మిణుగుర్లు చల్లు నగ్నింబోలెన్ ॥ 83

కం॥ కఱగఱి బలుకును గైదువ
మెఱయుచుఁ బరమర్మభేదమే చూపినచో
గుఱుతగుఁ బ్రతాపవంతుఁడు
మఱిమఱియును దెరలి కెరలి మహిఁ బగఱయగున్ ॥ 84

క॥ ఇల జనులకుఁ బరుసనగాఁ
బలుకుచు వెఱపింపవలదు పతి తియ్యనిప
ల్కులె పలుకవలయు నటులం
బలికినచోఁ బేదనైనఁ బ్రజ సేవించున్ ॥ 85

క॥ జగతిన్ దుర్జనసాధక
మగు నాజ్ఞయె దండమనఁగ నగు దండంబున్
దగినయెడఁ జేయఁగాఁ దగుఁ
దగుదండము సేయఁ బతిని ధర నుతియించున్ ॥ 86

మ॥ తెలియ న్వ్యక్తసమైన యాజ్ఞగల ధాత్రీపాలుఁ డెంపుం బ్రజన్
దలఁకం జేయుఁ, దలంకుచుండు ప్రజ సంతాపంబుతో నైపలం
గలయుం, దత్ప్రజఁ గూడ మించునరి సంఘంబంచువేగన్ క్షయం
బలయుం గాన్పున ఘాప్రజం దలఁకఁ జేయంగాదు భూజానికిన్ ॥

క॥ ప్రజలను బాలించిన భూ
భుజుఁడు కడుం బ్రబలుచుండు భువి నెల్లపుడున్
ప్రజలు చెడఁ బతియుఁ జెడు నా
ప్రజలు కడుం బ్రబలఁ బతియుఁ బ్రబలుచు నుండున్ ॥ 88

క॥ ఎంతటి యపరాధుల ప్రా
ణాంతకమగు నాజ్ఞసేయ నుచితమగు భూ
కాంతుఁడు రాజ్యముఁ జెఱచిన
హంతనె దండింపఁదగు నయస్థితి మెఱయన్ ॥ 89

వ॥ అర్ధదూషణము. 90

క॥ చెఱుపంగఁ దగినవారలఁ
జెఱిపెదనని కినుకఁ బ్రియముచేసిన నది తా
ధర నర్ధదూషణం బనఁ
బరగున్ నీతిజ్ఞులైన ప్రాజ్ఞులచేతన్ ॥ 91

కం॥ కారణములేక కోపము
పేరినగల ధనము వెచ్చపెట్టుట కొఱగా
దారయ నాత్మ హితంబుల
చేరుపుతోఁ గోపనట్టి నృపతికి నెంచున్ ॥ 92

వ॥ మృగయావ్యసనము. 93

సీ॥ వాహనం బెక్కుచో వచ్చిన బడలిక
వాహనంబులఁ దోలి వడఁబడుటయు
వాహనంబులు దనవైపున రాక యొం
డొకదిక్కుఁ జేర్చఁ జేటొదవు టెంచు
నాఁకట దప్పిచే నలయుట ప్రజలకు
నన్నపానాదిక మమరమియును
చలిగాలి యెండచేఁ గలిగినపీడలు
ప్రతియానములచేతఁ బరగుపీడ
గీ॥ కసవుచే తెల్లుచే వెంఢి యిసుకచేతఁ
జెట్లచే గట్లచే ముండ్ల పట్లచేత
వేళ్ళచే నీళ్ళచే నాటవికులచేత
వెలయుపీడలు వ్యసనముల్ వేఁటలందు ॥ 94

కం॥ పుట్టల మిట్టల గుట్టల
పట్టుల మఱి మోటచెట్లపట్టున నెపుడున్
బెట్టుకొను వెతలు వేఁటన్
బుట్టెడు వ్యసనంబు లంద్రు బుధు లెచ్చోటన్ ॥ 95

వ॥ మఱియును. 96

సీ॥ కానల నదులను గట్టుల గుహలందుఁ
బొదలచెంతల దక్కి పొంచియుండి
కినుకతోఁ బాఱెగాండ్లను దోడి దొరలను
దను గడంగించినఁ దిగులువడుట
యెంతయుఁ గినుకతో నెదసియుండెదుఁ దన
బలముచే దాయాదకులముచేతఁ
ద్రోవలఁ గదు మోసపోవుట మఱియును
ద్రోవల భ్రమయుచుఁ దొట్రుపడుట
గీ॥ యాది యగుదోషములు వేఁటలందు నెపుడుఁ
బొదము గాపున నెప్పుడుఁ బుడమిఱేస
వేఁటలాడెడితపుకంబు విడువవలయు
నీతిమార్గం బెఱింగిననృపపదుండు ॥ 97

చం॥ ఎలుగులు సింగముల్ పులుయి నేసుఁగులుం బెనుదాము లాదిగాఁ
గలిగినక్రూరజంతువులు గ్రమ్మ భయమ్ములు మీఱుఁ గాచని
చ్చలువదిఁ జుట్టికొంటయును జూపుల దిగ్భ్రమ మాపహిల్లఁ దా
నలఁగుట వేఁటయందు వ్యసనంబులు రాజున కెంచిచూడఁగన్ ॥

వ॥ వేఁటయందు షడ్గుణములు. 99

చం॥ నిలుకడ గల్గులక్ష్యములు నిల్కడలేక చలించులక్ష్యముల్
బలువిడినేయు, టామము కఫంబును గ్రొవ్వు నడంగిపోవుటల్
మెలఁగెడు వేళలన్ శ్రమము మించకయుండుట, జంతుజాతికిన్
గల భయ రోషముల్ దెలియఁగల్గుట, వేఁటగుణంబులెన్నఁగన్॥

వ॥ ఇట్లయ్యును. 101

కం॥ ఇలఁ బ్రాణహారకములై
బలసినదోషములు పెక్కు ప్రాప్తించుటచేఁ
దలఁప మహావ్యసనంబై
పొలుపొందుం గాన వేఁట పోఁదగ దెందున్ ॥ 102

వ॥ అయినను పతి యొక్క తెలంగైన సాధన మొకటైన యుచిత క్రియలచేతనే వేఁటయందలి మంచి గుణంబులు గలుగుటకు నుపాయంబులు గలవు గావునఁ దత్ప్రకారంబు వివరించెద. 103

సీ॥ వేఁటాడగా నిచ్చ విభునకుఁ గల్గినా
దనపురంబునకుఁ బ్రాంతమునఁ గల్గు
పలచెంతనైన నేఱులచెంతనైనను
దగి మృగంబుల నెందు దాఁటరాని
యగడితఁ జుట్టిరా నసువొంది రమ్యమై
పొదలు ముండులు గల్గు పొదలు లతలు
విషకారణములైన వృక్షబలములేక
జలము బచ్చికబైళ్ళు చాలఁగల్గి
గీ॥ యర్ధయోజన పరిమితంబైన వెళవు
నిడుపు గల్గుచుఁ దగునట్టి యడవి యొకటి
యాప్తతతిచేత నిర్మింప నర్హ మంత్రు
వేఁట లాడెడుకొఱకు భూవిభున కెందు ॥ 104

సీ॥ కప్పుపుబ్బుల యొప్పుఁ గప్పుచాయలు గల్గి
పలుచనై కాయలుఁ బంక్తు గల్గి
ఘనలు కొల్పెడి తావి పూవుగుత్తులు గల్గి
గఱుతు పేరెఱుగు మ్రాఁకులునుగల్గి

భృంగాంగసంగీత భంగీతతులు గల్గి
శారికా కీరికా సమితిగల్గి
హరిణీ కలభజాల కరిణీకులము గల్గి
పల్లీమతల్లికావళులు గల్గి

గీ॥ చాల తోఁతులుచేక మొసళ్ళులేక
శోభితములైన కొలఁకుల చోట్లు గల్గి
మిగులఁ జెలఁగెడు వనము నిర్మింపఁజేయ
వలయు నాప్తులచేత భూవల్లభుండు ॥ 105

సీ॥ పోఁపఁగాఁ గొట్టిన పుట్టలు మిట్టలు
శిలలు మొద్దులు ముండ్లచెట్లు గల్గి
నిండారఁ బూన్చిన నెఱియలు బొఱియలు
గుంటలు గోదముల్ గొబలు గల్గి
పరిఖవెంటనెయుంటి పలుదెఱంగుల తీవ
లల్లిబిల్లిగ నిండ నల్లికొనిన
రాజితంబగు వనరాజిచేఁ జుట్టిరాఁ
జెలువొంది వెలిని బ్రమాఁపటును వేక

గీ॥ మిగుల వెడలుపు చదురమై మెఱయునట్టి
భూమియును గల్గి తన శత్రు భూపతులకుఁ
జేరఁగా రాక రమ్యమై చెలఁగు వనము
నాగుసేయించవలయు భూపాలుఁ డెపుడు ॥ 106

వ॥ మఱియు నాటవికతతుల మనంబు తెలుంగంజాలి తనకు నాప్తులుం గ్లేశాయాస సహిష్ణువులైన జనంబులచేతఁ దద్వనరక్షణంబు సేయింపుచునుండెడి మృగయాధ్యక్షుండైన యతండు వివిధ జాతుల మృగంబులం బట్టితెప్పించి యందు దుష్టమృగంబులైన

వానికి గోళ్ళును గోలలును గొమ్మలునుం గొట్టించి యందు విడి
పించఁజేయ వలయు నంత. 107

కం॥ ఇతరంబగు పని మఱుపక
చతురత లివగల్గి యాప్తజనములతోడన్
బతి ప్రొద్దున వేఁటాడగ
నతి సన్నాహమున వనికి నరుగఁగవలయున్ ॥ 108

కం॥ జనపతి వేఁటాడగఁ దొ
ద్దనసీమనుజెందు నట్టితఱి నుండంగాఁ
జను నాప్తబలము ప్రాంతం
బునఁ గడు నాయత్తపాటు పొదలుచునుండన్ ॥ 109

కం॥ అడవుల వేఁటాడంగాఁ
దొడరెడి సద్గుణములెల్ల దొరకుం దొరకున్
బుడమిం గల్పితవనముల
మొదలనె క్రీడించు నిచ్చ మెసఁగినచోటన్ ॥ 110

ఆ॥వె॥ వేఁటయందు నిట్టి విధము మంచిది యని
పలుకుదురు ధరిత్రిఁ బ్రాజ్ఞులెల్ల
నటులఁగాక వనికి నవనీశ్వరుండు దా
బోయరీతి వేఁట బోవరాదు ॥ 111

వ॥ జూదమునకు. 112

సీ॥ ఎంత ధనంబైన నిసుమంత సేపులో
పల నాశమౌటయుఁ బరుసదనముఁ
గోప మందుటయుఁ బల్కులచేత జగడంబు
నాయుధంబులచేత నగు కలహము

దెబ్బలాడుట ధర్మముల్ చెఱుటయుఁ
జేయంగఁ దగుపనుల్ సేయలేమి
యతిలోభ మందుట యార్యుల విడచుట
దుర్జనసంగతి దొరకుటయును

గీ॥ జేటునకుఁ గారణంబులు చేకురుటయు
వైరములు చెందుటయు సిగ్గు వదలుటయును
మొదలుగాఁ గల్గు బహుదోషములను జెందు
హాళి జూదంబు లాడెడి యాతతాయి ॥ 113

సీ॥ కల యర్థములమీఁదఁ గాంక్షలు లేకుంట
యర్థంబు లేనిచో నాశపడుట
సంతోషమును మనస్తాపంబుఁ జలమును
గదుఁ బ్రతిక్షణమందుఁ గలుగుటయును
పులకంబు మొదలుగాఁ గలిగిన దేహర
క్షణములయందు భోగములయందు
నాదర మించుకయైన లేకుండుట
మెలఁగకుండుటచేతఁ గలిగినట్టి

గీ॥ దుర్బలత్వంబుచేఁ జాలఁ దూలుటయును
మంచి శాస్త్రార్థముల నుపేక్షించుటయును
మొదలుగాఁ గల్గు బహు దోషములను జెందు
హాళి జూదంబు లాడెడి యాతతాయి ॥ 114

కం॥ మలమూత్ర నిరోధంబులఁ
గల పీడలు దప్పికొనుటఁ గల పీడలు నాఁ
కలిఁ గొనుటవలనఁ బొడమెడి
యలమటలుం జూదమాడు నతనికిఁ జెందుఁ ॥ 115

సీ॥ నయఁదేల కోల్పడి కులకాంత నడవిలో
పల డించి తా నడవాల యయ్యె
ధర్మజుం డాలిని ధర నోడి యిలనెల్ల
విడచి కంకుండన విరటుఁ గొల్చె
దంతవక్త్రుండును దా బలభద్రుచే
గుఱుతుగా బండ్లూడఁగొట్టఁ బడియెఁ
గుండినపుర మేలుచుండురుక్మవిభుండు
జయము పోనాడి నాశనముఁ జెంచె

గీ॥ జూద మాడియె కాదె యీ జూదమెంత
వాని నైనను భ్రమయించు వాసి చెఱచు
జూదము సకలగుణములఁ జూరలాడు
జూద మెంతటివానికిఁ గాడు ధరను ॥ 116

కం॥ జూద మనర్థముఁ దెచ్చుం
జూదంబున భేద మందుఁ జుట్టతికంబుల్
జూదమున నెయ్య ముడుగుల్
జూదమె పో కాని దెంచి చూడఁగఁ బతికిన్ ॥ 117

వ॥ స్త్రీవ్యసనానకు. 118

సీ॥ కార్యకాలంబులు గడచిపోవుటయును
నర్థంబు ధర్మంబు నలఁచిచెడుట
యెవ్వేళ నిలువెళ్ళ నెఱుఁగని కతన స
జ్జనులు మంత్రిజనంబు గినియుటయును
ధరణిపైఁ బక్షపాతంబునఁ జేయఁగా
రాని కార్యంబైనఁ బూనుటయును
దాల్మి లేకుండు టెంతయుఁ గోపమందుట
వైరంబు సాహసవర్తనంబు

ఆ॥వె॥ లాదిగాఁగఁ గల్గునట్టి దోషము లెల్ల
వెలఁదివలన నెపుడుఁ గలుగుచుండు
నటులఁగాన నది మహాదోషయుక్తంబు
విభుఁడు దీనిఁదెలిసి విడువవలయు ॥ 119

కం॥ చెలువల మోముల చూచుట
వలపడి వేగిరముచెందు నల్పాత్ములకుం
గల కోర్కులెల్ల జవ్వన
ముంతోడంగూడ నాశముం గనకున్నె ॥ 120

వ॥ పానమునకు. 121

సీ॥ తెలివిలేకుండుట పలుమాఱు బెగడుట
వక్కుటయును గోడ కట్టమియును
గల్లలాడుట బంటుగరిమ పోనాడుట
తలఁపు ప్రజ్ఞయు మతి తలఁగుటయును
బనిలేనితటి పెంపుఁబడుట నిర్వృతియును
ప్రాణబాధయును నింద్రియము గనుట
సత్పురుషులతోడిసంగతి విడలుట
దుర్జనసంగతి దొరకుటయును
గీ॥ గడగడ వడంకుటయు జాఱిపడుట కడు న
నర్థ మొందుట స్త్రీగోష్ఠి యధికమగుట
యాదియగు దుర్గుణంబుల నందుచుండు
మద్యపానంబుఁ దగిలిన మానవుండు ॥ 122

కం॥ పానవ్యసనముఁ జెందిన
మానవుఁ డెచ్చోటనైన మదమున మెలఁగున్
దానమదంబున నెచ్చో
నైన బహిష్కార మొంది యధమతఁ జెందున్ ॥ 123

కం॥ భృగుసముఁడను యోగీశ్వరుఁ
డగణితమతిశాలి షడ్గుణైశ్వర్యయుతుం
డగు శుక్రుఁడుఁ బానముచేఁ
దగి పరమున శిష్యవరుని దండిగఁ ద్రావెన్ ॥ 124

కం॥ కులమును బలమును వేదం
బులు శాస్త్రంబులును శీలమును సంపదలుం
గలవారైనను పానం
బలవడుటనె చెడరె యాదవాంధకవృష్ణుల్ ॥ 125

కం॥ సిరిఁ దొలఁగఁజేయు వ్యసనము
లరయంగా నేడుతెఱఁగులై యవి యెప్పుడున్
ధర నివి యొక్కటియె నరుఁ
డెఱుఁగున్మతి యిన్నిగూడఁ దెలియుట యరుదే ॥ 126

కం॥ మగువల సెంతయుఁ దగిలినఁ
దగురీతుల మద్యపాన తత్పరుఁడైనన్
దగు కొంత వేఁట జూదము
మిగులం గీడౌట విడచి మెలఁగఁగవలయున్ ॥ 127

ఉ॥ వలఁపఁగ మిక్కిలిన్ విషయతత్పరతన్ గడిగించు తెన్నుగా
నిలుపకు వేదశాస్త్రముల నన్నిటి దూరఁగఁజేయు సద్గుణం
బులను మహత్త్వముం దెలియు బుద్ధియుఁ బెద్దఱికంబు నింపునన్
జలనము నందఁజేయును వెసన్ వ్యసనంబులు దాఁట యుక్తమే ॥

కం॥ వ్యసనములు గలుగు నరపతి
వసుధం బసదొఱఁగు వైరివర్గముచేతన్
వ్యసనములులేని నరపతి
యసదృశగతి మెలఁగి గెలుచు నరిసంఘములన్ ॥ 129

ఉ॥ ఇదియిది దీనికిం దగి రచించు నటంచును గోర్కె మీఱఁగా
మదిఁ దలపోసి తాఁ బ్రకృతి మండలి సత్క్రియతోడఁ గూర్చి స
మ్మదమున నీతి రీతులను మానవనాథుఁడు దా మెలంగినన్
వదలనిగౌరవంబునఁ ద్రివర్గముఁ జెందుఁ బ్రతాపశాలియై ॥ 130

చం॥ అనుపమదాన దానయుతహస్తిలసద్బలవాహచక్రపా
లనపటుసార సారసవిలాసవిలోకన లోకనవ్యస
ద్వినుత విహార హారరుచివిశ్రుతకీర్తినివాస వాసవా
త్మనఘమనోజ్ఞభోగ విభవానిశ బంధురబంధురక్షణా ॥ 131

క॥ దీప్తోత్సాహ మహోజ్జ్వల
సప్తాంగ సుదాంతదక్ష సకలదిగంత
వ్యాప్తప్రతాప వరబల
జాప్తాన్వయరామభామినాసక్తమతీ ॥ 132

కవిరాజవిరాజితము ॥
పటుల తురంగమ సంక్రమణ క్రమనైపుణ విరాజితసారసమా
ద్భటపటహప్రతతి దంభణదంధణ దాయిజనిస్వన దారితమా
త్స్ఫుట మదశాత్రవ భావ ప్రతాపత భావవిభాసురభూధరితా
స్ఫుటపలయాచల భాసుతసద్గుణభూషణ నిత్యవిభుత్వయుతా ॥

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత
భారద్వాజసగోత్ర జక్కరాజ యెఱ్ఱనామాత్యపుత్ర సుకవిజన
విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవనామధేయ వేంకటనామధేయ
ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు
నుత్సాహ ప్రభుశక్తియు సప్తాంగప్రయోజనంబులుఁ దివ్యాస
నంబులు నన్నది షష్ఠాశ్వాసము. 134

—※—

# ఆంధ్రకామందకము

## ప్రథమాశ్వాసము

కం॥ శ్రీమదహోబల నృహరి
స్వామిపునస్స్థాపనప్రశస్తజయాంకా
రామపదభక్తి వరవి
ద్యామహిమా రాంద్రాజు వెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### యాత్రాభియోక్తృ ప్రదర్శన ప్రకరణము

కం॥ వ్యసనము విడిచి త్రిశక్తుల
బొసఁగి జయాకాంక్షియైన భూపతి దనకుం
బసగలతతిఁ గదలఁగఁదగు
వ్యసనంబులు వొందినట్టి వైరులమీఁదన్ ॥ 3

చం॥ వ్యసనము గల్గియుండు రిపువర్గముపైఁ జనె దండు పోవఁగాఁ
పొసఁగునటంచుఁ బల్కుదురు పూర్వికు లట్టిమతంబె కాదు త
ద్వ్యసనము లేకయుండు రిపువర్గముపైఁ జటనైనఁ బూని వె
ళ్ళసముగురీతి దండు చనఁగాఁ దగుఁ దాను సమర్థుఁడైనచోన్ ॥

కం॥ ఇలతేఁడు శత్రు గెలువం
గలవేళలనైన శత్రుగణముల రాజ్యం
బుల బలిమిఁ జెఱుపనోపం
గలవేళలనైన దండు గదలఁగవలయున్ ॥ 5

ఉ॥ పైరులు పండి పుంజగలపట్టున వైరులసీమమీఁదటన్
ఘోరమహిణుండై దండు చనఁబొల్పగు నీగతి దండువెళ్ళుచున్
పైరులు చూరఁబట్టి పరిపంథుల జీవనముల్ హరించినన్
సారబలంబుచేఁ దనరి శత్రుల గెల్చును నిర్భయస్థితిన్ ॥ 6

చం॥ వెనుకటిపైరులం దనదు వెన్కసురాఁ గడు మట్టుపెట్టి పెం
పునఁ బరిచర్యలం దెలిసి ముందరఁగల్గు భయప్రదేశముల్
గనిమిటు తెన్నుగా నెఱిఁగి కంటకశుద్ధి యొనర్చి రాను పో
వను పగుమార్గమందుఁ బతి యాత్ర సనందగు సప్రమత్తుఁడై ॥

చం॥ నడుమనడుచోట్ల గుంటలును జాలఁగ మిట్టలునైనచోట్ల నె
య్యముగలసేన మున్నుగఁ బ్రయాణమువోవుట యొప్పు పైధన
క్రమములయందుఁ దానెఱుఁక గల్గుచు నార్తుఁడుగాక యన్నపా
నముల సమృద్ధిఁజెంది జతనంబుగ దండు సనంగఁ జెన్నగున్ ॥

చం॥ జలము పసంబునుం గలుగు చాయనె వేసవి వైరిమీఁదఁ బో
వలయు మదేభముల్ జలమువల్ల ఘటిల్లెడు సౌఖ్యమొందఁగా
జలములు లేకయుండినను సామజపంక్తులకెల్ల వేసవిం
గలుగుచునుండుఁ గష్టములు గాడుపుటెండలఁ బుట్టువెట్టచేన్ ॥

కం॥ ఒక్కయెడ నిలుచునప్పుడు
గక్కసముగ వెట్టనొంచుఁ గరి బృందములన్
ముక్కలిఁ బ్రయాణముల నిక
వెక్కసమై నొంపమున్నె వేసవివేళన్ ॥ 10

కం॥ నీరములు లేని వేసవి
సారెకు దురవస్థఁ బొందు జంతువు లెల్లన్
వారణపంక్తుల కైనం
దీరనితాపముల నపుడె దేహము వెంటన్ ॥ 11

ఉ॥ ఘుమ్మను మంచివాసనలు గ్రమ్ముమదమ్ములు గల్గి కొమ్ములం
జిమ్మట సుగ్గుసూచములు చేసినగట్టులు గల్గి మీఱి కా
ర్గ్రిమ్ముచుఁ గప్పు మబ్బుగమికప్పులయొప్పులు గ్గుడుంతి సం
ఘమ్ములయందె కా ధరణికాంతులరాజ్యభరంబు నిల్చుటల్ ॥ 12

మ॥ అవిచూడన్ సడగొండలో యనఁగ నీలాభ్రంబులో నాఁగ గ
ట్లవియం గొమ్ములఁ జిమ్మసోర్చి మదధారాసారతం బేర్చి శా
త్రవులం గోయపులాడనేర్చి తగు నుద్యద్భద్ర నాగేంద్రముల్
భువి రాజ్యాస్పదహేతువైనవి గదా భూపాలకశ్రేణికిన్ ॥ 13

ఉ॥ శూరతపోటునేర్పు సముజ్జోకయుఁ గల్గిన మావటీఁడు పెం
పారఁగ నెక్కి యుక్కెసఁగి యాయితపాటున మీఱు వారణం
బేరణమందునైన జవమెచ్చినవాజుల నాలువేలఁ దా
నీరతమించఁ ద్రుంచు విసుతించు సుదంచితసాహసంబునన్ ॥

కం॥ జలముల నడవుల నప్పుల
బలుదిన్నెల సమములైన పట్టుల వడిఁ గో
టలును గడపు వడియేనుం
గులు గలిగిన దొరకు దొరకుఁ గోరిన జయముల్ ॥ 15

కం॥ ఏతెరువు నీళ్ళు గలయది
యేతెరువు పరభయంబు లెసఁగక తగుఁ ధా
నాతెరువునఁ జనవలయున్
భూతలపతి బలము శ్రమముఁ బొందకయుండన్ ॥ 16

## దండయాత్రా విధానము

సీ॥ అధిపతి దండెత్తునట్టిచో శుద్రశ
త్రుండును వెనుక శత్రువుల రేఁచు
నదియు రంధ్రము గాన నహితులౌవారెల్లఁ
గడు ఘనంబుగఁ జేయఁ గడఁగుచుండుఁ

బతికి ముందఱనచ్చుఫలమున కంటెను
వెనుక శత్రులపోరె ఘనము దెలియ
సరిగాక కాననియర్థంబుకొఱకునై
చేకొన్నయర్థంబు చెఱుపరాదు

గీ॥ దాసఁ దనబల్మి పైబడల ఘనతఁదెలిసి
వెనుక శత్రుల పగమాన్పి విమతుమీఁద
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 17

సీ॥ తనకుఁ బిఱుంద శాత్రవుఁడున్నచోఁ బస
కతఁడునులోఁగక యరిగెనేని
వెనుకటి శత్రువు వేగ భేదముచెంది
యలమట నొందించు నటులఁ గాసఁ
దనకుఁ బిఱుంద ముందఱఁగల్గు శత్రుల
నడఁపగా నోపినయట్టి శక్తి
గలుగు వేళలను విక్రమయుక్తిచే మించి
ఘనములౌ ఫలములు గలుగనెంచి

గీ॥ తనకు నెలవైనపట్టణంబునకు రక్ష
ణమ్ము గావింపఁదగినబలమ్ము నుంచి
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 18

సీ॥ అరయంగ నిఱువదియగు సంఖ్యఁ దగుభటుల్
గలుగు చేరువయు వర్గంబటండ్రు
ధారుణీస్థలి నిట్టిసేరువ కొక్కొక్క
ఘనుఁడైన సేరువకానిఁ గూర్చి

పెక్కు చేరువలును బెక్కు చేరువకాండ్లు
గలిగిన తన యాప్తబలము నేర్చి
తన పట్టణముఁగావ నొనరింపఁగాఁ దగు
నితుల నేరువకాండ్ర నేర్పరింపఁ

గీ॥ బరుల కెందు సభేద్యులై పరగుచుండ్రు
గాన నీరీతి నొనరించి ఘనత మించి
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 19

సీ॥ తనకు సహాయమౌ దైవంబుచేత సు
వ్యక్తుఁడై దండెత్తుచుండు రాజు
ముందరికి నవశ్యమును జను వార్యంబు
వెనుకశత్రుని రాక మొనయు నంట
యొక్కవేళనె కల్గియుండినఁ బదరఁ
దళవాయినైనను దనయునైనఁ
దన బలంబులలోనఁ దగినట్టు నాలవ
పాలైన మూఁడవ పాలునైన

గీ॥ బలము నొనఁగూర్చి ముందరి పగఱమీఁద
ముసువుగా నంపి తా నిల్చివెనుక పగఱ
నుదుగఁగాఁజేసి కదలుట యొప్పునండ్రు
దండయాత్రావిధిజ్ఞులీధరణిలోన ॥ 20

## కోపద్వైవిధ్యము

వ॥ మఱియు నాంతరకోపంబును బాహ్యకోపంబనఁగ రెండు తెఱంగుల కోపంబులు గలవు. వానియందు నాంతరకోపంబు యధికంబగు నటులైనను నయ్యిరుతెఱంగులవారి కోపంబులు వారించి

మతి యభీష్టంబుల నొనర్చి వారిం దనవెంటఁ దోడ్కొని చన
వలయు నె య్యాదెఱంగులవారి కోపంబు లెట్టివనినఁ. 21

సీ॥ సుతమంత్రిహిత పురోహిత నిజవంశజ
సేనాధిపతులు ప్రధానజనము
లంత్రు ధాయణి వీరలందు నొక్కనికోప
మైన నాంతరకోప మనఁగఁబరగు
నడిఁగాచువారలు సదవులకడ నుండు
ప్రజయును మఱియెంచ బాహ్యజనము
లరయంగ వీరలయందులో నొక్కని
కోపమైనను బాహ్యకోప మగును

గీ॥ తనకు నాప్తులు చతురులై తగినయట్టి
మంత్రిజనములచేతను మనుజవిభుఁడు
తెలియఁదగు నిట్టికోపముల్ తేటపడఁగ
మించి వారల శాంతిఁ బొందించుకొఱకు ॥ 22

గీ॥ ఎట్టిరీతినిఁ దప్తులై యెదసి పగఱఁ
గూడుకొనిపోవ రటులఁ దత్కోపమడఁప
నమరు సామాదులగు నుపాయములనైనఁ
గట్టుకొని వారి విరిపోటు పెట్టియైన ॥ 23

కం॥ హయములును భటులు చచ్చుట
క్షయమగు దవసంబు లసిఁడి కడు వ్యయమైనన్
వ్యయమగు నిటులన్ క్షయమును
వ్యయమగు పయనంబు మానవలయుఁ బతికిన్ ॥ 24

కం॥ ఫలముఁ బశ్యము దనకుం
గలయది వేఁ జేతి కిచ్చుగతి వేగమె కా
గలయది వ్యయప్రయాసము
గలిగినయదియైన దండు గదలఁగవలయున్ ॥ 25

కం॥ ఏనుఁగులకు గుఱ్ఱములకు
మానుసులకు నొప్పిదాఁకి మఱి ఫలసిద్ధిం
గానక నొగిలెడు బనికిం
దా నెందును దండుపోవఁ దగ దధిపతికిన్ ॥ 26

## కార్య వ్యసనంబులు

వ॥ తనకున్ శక్యముగాని వస్తువులమీఁదన్ యత్నముల్ సేయుటల్
దనకున్ శక్యములైన వస్తువులమీఁదన్ యత్నముల్ మానుటల్
దనకున్ శక్యములైన వస్తువుల వేగన్ గోరుటల్ మానఁడి నెం
దును గార్యవ్యసనంబులండ్రు నయవేదుల్ మేదినీమండలిన్ ॥

సీ॥ ఓర్పును గరుణయు నోర్పురేపించుట
దాక్షిణ్యమును బ్రమాదతయు భయమ్ము
దంబును సిగ్గు దుష్టత్వంబు దైన్యంబు
నతిధార్మికత్వ మహంకృతియును
దనజాతిఁ బుట్టిన జనులఁ గాదనుటయుఁ
జంపుటయు నుపేక్ష సలుపుటయును
బలువగు నెందకుఁ జలికిఁ దా నోర్వక
యుండుట వానకు నోర్వలేమి

గీ॥ యివియవేళలఁ జేసిన నెందుఁగార్య
సిద్ధులకు నెల్ల విఘ్నముల్ సేయుచుండు
ననుచు నీతిరహస్యజ్ఞు లండ్రుగాన
వీని ననుచితవేళల విడువవలయు ॥ 28

సప్తవిధ పక్ష లక్షణము

వ॥ మఱియు మైత్రులును, నిజులును, సంబంధులును, భృత్యులును, నాశ్రితులును, గృహీతులును, గార్యజులు ననెడు నేడు దెఱంగుల వార చే పక్షంబనం బరఁగుచుండుదు రిట్టి పక్షంబనంగ సహాయు లనం బరగుచునుండు నిట్టి సహాయు లెట్టివారనిన. 29

సీ॥ తన తల్లిదండ్రుల యనుఁగుంబంధులె మైత్రు,
లెనసిన ప్రాంతవారెల్ల నిజులు,
పరవి వియ్యంకులె సంబంధులగుచుండ్రు
భృతికిఁ గొల్చెడువారె భృత్యు లరయ
నాత్మరక్షణమున నాశ్రయించినవార
లాశ్రితు లుపచార మందియుండు
వారు గృహీతులు వసుధఁ గార్యార్థులై
యనువొందువారె కార్యజులు దలఁప

గీ॥ నిటుల నేడుదెఱఁగులౌ నిట్టివారి
పక్షము లటండ్రు ప్రాజ్ఞులై పరగువార
వింటు రాగాపరాగంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 30

వ॥ ఇట్టి సహాయు లనురాగిసహాయులు నిద్వ్యక్తసహాయులు నన రెండు తెఱంగులై యుండుదు రందు ననురాగంబుగల సహాయు లెట్టివారనిన. 31

అనురాగి సహాయలక్షణము

చం॥ అనిశముఁ జేరికొల్చి సుగుణావళిఁ గీర్తనచేసి నిందలన్
వినక తదర్థమై తనరు విశ్రుతయత్నము పల్కు శౌర్యముం
గని కనుపట్టు దోషములఁ గప్పుచు నుండుట యెంచు నెంపుఁగా
ననువగు నెయ్యముల్ గలుగునట్టి సహాయునిచిహ్న మిమ్మహిన్॥

వ॥ సద్వృత్త సహాయుం డెట్టివాడనిన. 33

సద్వృత్త సహాయలక్షణము

చం॥ కులమున మించి మోహమునఁ గూడక దైన్యముచేక విద్యలన్
బలమును సత్యముం గలిగి పాటిలు లోభము డించి బుద్ధిచే
సలరుచు మేలెఱింగి వినయంబు వహించినయట్టిమిత్రుఁడే
వలన నుతించ మంచి తగువర్తనమొందిన పక్షమై తనన్ ॥ 34

ఆత్మగుణముల నుద్యోగాదుల శ్రేష్ఠత

గీ॥ త్యాగ ముద్యోగమును ధీరతయును బుద్ధి
నిజము మర్యాద సిగ్గు నింద్రియజయంబుఁ
బ్రౌఢియును గారవం బనురాగ మోర్పు
బలము సన ముఖ్యగుణములు పార్థివునకు ॥ 35

శక్తిత్రయ స్వరూపము

సీ॥ సారమౌ నీతిప్రచారం బెఱుంగుట
జగతిలోపల మంత్రశక్తియందు
రాత్మసంపదతోడ నలరినబలము కో
శంబు నెంచఁగఁ బ్రభుశక్తియంద్రు
ఘనమైనయట్టి విక్రమమును బుద్ధియు
సత్త్వంబు నుత్సాహశక్తియంద్రు
నీతిమంతులుగాన నృపవరుం డెల్లచో
నిట్టి త్రిశక్తుల నెనయవలయు

గీ॥ నిటులు శక్తిత్రయంబుచే నెనసి యెపుడు
నేర్పుతోడుత వర్తింప నేరకున్న
మించు శత్రుల నెటుల జయించనేర్చుఁ
జెలఁగి సంపద నేరీతిఁ దెందనేర్చు ॥ 36

సీ॥ వ్యసనమందిన దైన్య మందకుండుటయును
ఘనమైన శౌర్యంబుఁ గలుగుటయును
దక్షతయును శీఘ్రతయు మహోత్సాహ సం
పదయంద్రు జగతిలోఁ బ్రాజ్ఞులెల్లఁ
బుట్టగాఁ బుట్టిన బుద్ధియు శాస్త్రంబు
దెలియుటకతమునఁ గలుగుబుద్ధి
పెద్దలసంగతిఁ బెనుపొందుబుద్ధియుఁ
గడు విచారింపఁగాఁ గలుగుబుద్ధి

ఆ॥వె॥ జ్ఞానరూపమంత్రిసంపద యనఁదగు
నిట్టి రీతులెల్ల నెఱుఁగనేర్చి
తనదు రిపులమీఁద దండు పోవఁగఁదగు
నీతి నెఱిఁగినట్టినృపవరుండు ॥ 37

ఉ॥ అల యుత్సాహము శౌర్య మందుటయుఁ గా
ర్యం బూనుటల్ సేయుటల్
బయిపై నిల్కడ పౌరుషంబు ముదముం
బ్రాపించు టారోగ్య ముం
దలపెల్లన్ ఫలసిద్ధిచేఁ దగుటయున్
దైవానుకూల్యం బగున్
దెలివిన్ భూపతి యిట్టివేళల ధరి
త్రిం దండుపోవం దగున్ ॥ 38

కం॥ జనపతి తన భండారం
బనుపమగతి వెంటరా సహాయాదులచే
నసువొంది గెలుచుటకునై
చనఁదగు బహుదిహీనశత్రుపుమీఁదన్ ॥ 39

కం॥ ఈరీతి నీతియుతుఁడై
ఘోరపుణావరుందు దండు వోయినయేనిన్
సారోదారతఁ బారా
వారావృతమైన ధరణివలయం బేలున్ ॥ 40

## దండయాత్రాకాల దేశాదులు

చం॥ జలములు మబ్బుగల్గుతటి సామజపంక్తికి దండు పోఁదగున్
జలములు మబ్బులేనితటి సైంధవరాజికి దండుపోఁదగున్
వెలువని జల్లు మంచుఁ గసువెట్టియు లేక చెలంగ నాటనెం
గలయఁగ సర్వసైన్యములు గైకొని భూపతి దండుపోఁదగున్ ॥

గీ॥ గూబ రాతిరిఁ గాకులఁ గొట్టి నొంచు
కాకి పగలైన గూబల గరిమఁ జించుఁ
గాన వేళ విచారించి కదలవలయుఁ
గాల మెఱుఁగుచుఁ గదలినఁ గలుగు జయము ॥ 42

॥వె॥ కుక్కచేత మొసలి చిక్కును దరియందుఁ
గుక్క మొసలిచేతఁ జిక్కు నీట
నటులఁ గానఁ దనకు ననువైన చోఁ బొంది
చెలఁగు రాజు కార్యసిద్ధిఁ జెందు ॥ 43

సీ॥ సమములై కసువట్టు చవురపునేలల
నశ్వముల్ మున్నుగా నరుగవలయు
మిట్టలు గుట్టలు గట్టులు నైనచో
నేనుఁగుల్ మున్నుగా నేఁగవలయుఁ
బొదలును ద్రూఁపులుఁ బొదలెడిచోటులఁ
గాలాళి మున్నుగాఁ గదలవలయు
జలములు లోఁతుగాఁ గలిగినచోటులఁ
దగిన యోడలమీఁద దాఁటవలయుఁ

సీ॥ జదురములు మిట్ట గుంటలు జలముఁబొటలు
గలుగు నటుపంటి నేలల బలముడిందు
సంచుచే ముందు చనఁదగు నందుచేతఁ
దోవఁదగు దండయాత్ర మహీవిభుండు ॥ 44

చం॥ జనపతి వానకాలమునఁ జాలఁగ మిట్టలమించు త్రోవలన్
బనుపడ వేసవిన్ సలిలమార్గమునం జన నొప్పు నెండుఁ బె
క్కినయెడ మిశ్రభూములను గేవల దుర్ఘటమైన మార్గముల్
గనుగొని యాత్మసేనకు సుఖంబగు రీతుల దండుపోఁదగున్ ॥

ఆ॥ జలములు కడుఁ గలత్రోవన్
జలములు లేనట్టి త్రోవఁ జనక సుఖగతిన్
నెలవరులఁ గూడి చనఁదగు
గలయం గట్టియుఁ గనవు గలిగినత్రోవన్ ॥ 46

మ॥ తన చుట్టంబుల మూఁక రాకదలచే ధాన్యాదిక ప్రాప్తిచే
ననువై పెక్కుఁదెలంగి నమ్మకల లోనై యుండు తన్మార్గ భూ
జనముల్ గల్గినత్రోవఁ బోవఁదగు నెంచం దీసుఁడై భంగముం
గని వీఁకల్ చెడి వచ్చుత్రోవఁ జనఁగాఁ గాదెందు భూభర్తకున్॥

చం॥ తెలియక దూరమైన రిపుదేశము వేగిరపాటు మీఱఁగాఁ
జలమునఁ జొచ్చిపోవు దొర సంగరరంగమునందు వైరిభూ
తలపతి ఖడ్గధారల విదారితుఁడై బహు రక్తధారలం
గలగొని పొక్కియుక్కసెడి గ్రక్కుననూరకె చిక్కిస్రుక్కఁడే॥

వ॥ ఇట్లుపాయంబులఁ జెంపిని యుపాయంబులం బయసంబులు
గదలివచ్చి సైన్యంబులు విడియింపందగు నచట మఱియును. 49

చం॥ అరులకుఁ జాలరానియటు లాత్మబలంబుల నిల్పి రక్షణం
బరయుచు నీతిరీతిఁ దగి యాప్తులు శూరులునైన యోధులె

చ్చరికెలఁ జుట్టియుండగ నిశాసమయంబుల యోగనిద్రలం
బొరయుచు నుండగాఁ దగును భూపతియెందును జాగరూకుఁడై ॥

చం॥ కలయఁగఁ జాలి రొప్పు కరిఘంటలగ్గలు ఘణంఘణ ధ్వనుల్
మెలఁకువఁజెంది గుఱ్ఱముల మించిన హేషిత ఖాంకృతిధ్వనుల్
నిలుపఁదఁగాంచు యోధతతి నిశ్చలవాక్య డిమండిమ ధ్వనుల్
నెలకొని వీనులంటఁ బతి నిద్దురసందున మెల్కనై తగున్ ॥

కం॥ నిదురతఱి నప్పటప్పటి
కది యెవ్వఁడు మేలుకన్న యతఁడని పతి దా
నదయుఁడయి యాదరింపుచుఁ
బదిలంబని యెచ్చరించి పలుకఁగవలయున్ ॥ 52

వ॥ అంత. 53

దండయాత్రా సమయముల రాజవైఖరి

చం॥ తెలతెల వేగలేచి నరదేవశిఖామణి నాపతీర్థమై
కల కులదైవముం గొలిచి ఘుమ్మను కస్తురి తావి తీవితోఁ
చిలుకుదళుక్కున న్మిసుమ దాఁకొను రత్న విభూష జాళితోఁ
గొలువుకు వచ్చుటొప్పు నిరుగోవులగట్టిన వా రహో యనన్ ॥

సీ॥ శ్రీమంతులై మించు సామంతు లొకవంక
నుచితమంత్రులు మంత్రు లొక్కవంక
హితచర్యులగు పురోహితవర్యు లొకవంక
నుదిత సత్యు లమాత్యు లొక్కవంక
ఫలదాయులైనట్టి దళవాయు లొకవంక
నుక్కు నిక్కిన శూరు లొక్కవంక
నపకారుల జయించు నధికారు లొకవంక
నుచిత మిత్రుల మిత్రు లొక్కవంక

గీ॥ నొక్కవంకఁ గళావతు లొక్కవంకఁ
జామరగ్రాహిణులు గూఢచరులు గొలువఁ
దన ప్రతాపంబుఁ బౌరజనము వొగడ
నింపువెడుకఁ గొలువున నుండవలయు ॥ 55

కం॥ ఆయెడ జగతీనాథుం
డాయతమతి మెఱయ మంత్రులను వారలతోఁ
జేయఁదగు నట్టిపనులు ను
పాయంబులు నిశ్చయించి పతి గదలఁ దగున్ ॥ 56

చ॥ అలవుసు వేగముం గల హయంబులనెక్కి తనంత వేచి వా
రలు బలుపైదువుల్ నిజకరంబులఁ దాలిచి వెంటఁగొల్వఁ బ
ల్లల సవిధాన మెచ్చరికె సాఁగ యహోయని పూని సాహిణుల్
గొలువఁగఁ దేజినెక్కి నృపకుంజరుఁడంతట యాత్రపోఁదగున్॥

ఉ॥ తనయంతేని నృపాలశేఖరులు మైత్రిస్నేహసన్నాహముల్
దనరం జేయ లనెక్కి యుక్కుపొడిదాలన్ గొల్వఁగా సాహిణుల్
వెనువెంటన్ జతనం బహోయనుచు సేవింపన్ గతున్మించి చ
క్కని సామ్రాణిపరాణినెక్కి కదలంగా నొప్పు రాజేంద్రుఁడున్॥

శా॥ రాజేంద్రుండు గజాశ్వసంఘములచర్యల్గ్గనంగా జనున్
గై జీతంబును గూట మేర్పఱచి వేడ్కం గానఁగాఁ జెల్లఁగన్
దేజం బాయితపాటునుం గడుఁ బ్రసిద్ధిం జెందియున్నట్టి బ
త్తేజీలం గజపఙ్క్తిఁ జూడఁదగు హాళిన్ రేవులన్మాపులన్॥

సర్వాపర్జనోపాయము

మ॥ సులభంబౌ పొదగాన్పుగల్గి దయచేఁ జూపట్టి యందిస్మృతం
బులఁ జెన్నొందిన పల్కుచేఁ దగఁ బ్రియంబుల్మాటికిం బల్కఁగా

వలయుం జీతముకంటె నెక్కుడుగ నిర్వక్రంబుగా నియ్యఁగా
వలయుం బ్రాణము లిత్తు రీ విహితమౌ వాక్యంబుచేతన్ భటుల్॥

ఉ॥ కరుల రథంబులందుఁ దురగంబులయం దలయోధలందుఁ దా
సరుగఁగ నేర్చి వింట నెరయం జతురత్వముఁ జెంది కార్యముల్
నిరతము నభ్యసింపఁదగు నేర్పున నీగతి నభ్యసింప దు
ష్కరమగు కార్యమైనను సుఖంబునఁ జెందు నరేంద్రుఁడున్నతిన్॥

మ॥ కడు సన్నాహముగల్గు సేన లిరువంకం గొల్వ సన్నాహముం
బొడవుంగల్గు గజంబునెక్కి రిపులో భూపాలకు ల్వంప వెం
బడి నేతెంచిన దూతతో భటలతుల్ పై మాటుగానుండ నె
క్కుడు నేర్పొందెడు మంచివాక్యముల పెక్కుల్మిఁబోవందగున్

గీ॥ బుద్ధిచే గుణములచేతఁ బొదలు గూఢ
చారిజనములచే దూతజనముచేత
వైరిచర్యలు దెలిసి పోవలయు వారు
లేనిపతి యెందును గన్నులు లేనివాఁడు॥ 63

ఉ॥ ఘనత దలిర్ప శత్రు గడిఁగాచుదొరం దన మిత్రుఁజేసికోఁ
జనునవు డించుకించుక యొసంగుచు నాశలు చాలఁజూపియై
నను మఱి బేరమాడునెడ న్యాయముదప్పక వైరి భూములం
బనుపడి వచ్చునెట్లు పరిపాలన మొప్పఁగ నేల్పఁగాఁదగున్॥

చం॥ అనువగుదూతఁ బంపి తనయందినకార్యము సంధిచేతఁ జ
య్యన నొనరింపఁగావలయు నట్లొనరించిన సంధిగానిచో
దనరుచుఁ గార్యభేదమగు దాన నభేదముచెంది వారిలోఁ
గినుకలు బుట్టుచుండు నది కేవలము బతికిన్ శుభంబగున్॥

ఉ॥ అడవులయందు దుర్గములయందు వసించినవారిఁ ద్రోవలుం
గడులును గాచువారల ఘనంబగుసామముచేత నీగచే

గడుఁ బనియించి మించి తన కైవసమై తగఁ జేసికోఁ డనుఁ
విడువక శత్రుభూములకు పీరలె త్రోవలు చూపఁ జాలుటన్ ॥

ఉ॥ కారణ మొందియైన మఱి కారణమేమియు లేకయైనను౯
వైరులయొద్దివారు తనపద్దకు వచ్చిన నాత్మసేవకుల్
వైరులఁ గొల్చియుండి తనవద్దకుఁ గ్రమ్మర వచ్చియున్న భృ
త్యరమణులందు వారలచరిత్రలు చెన్న నెఱుంగఁగాఁ దగున్ ॥ 67

గీ॥ పరులపై నెత్తుపతి మంత్రబలము చాలఁ
జెంది మున్నె విచారంబు సేయవలయు
బాహుబలమునకన్నను బలిమి మంత్ర
బలము నాసన యింద్రుండు గెలిచె రిపుల ॥ 68

కం॥ మేలగుమతివే సిరికై
కాలంబునఁ జెందవలయుఁ గార్యం బెపుడున్
గాలం బెడలినకార్యము
వాలాయము పచ్చుఫల మపశ్యము చెఱచున్ ॥ 69

చం॥ అలఘుప్రభావముం గలిగి యంచితకార్యములందు దక్షుఁడై
మెలఁగుచు మంత్రమార్గమునమెల్కువ చాలఁగఁ జెందియున్నతఁ
డెలఁగెడు ధారుణీధవులచేష్టల నెప్పుడు దండిమండలి౯
నిలుకడఁ జెంది యెల్లపుడు నిచ్చను దైవకరల్ ధరిత్రియున్ ॥

గీ॥ ఆమని చెలఁగుఁ గార్తికమందునైన
జ్యేష్ఠయును మూలకార్తెయుఁ జెందువేళ
నైన మఱి చైత్రమాసంబునందునైన
దండువెడలుట తగునండ్రు ధరణిపతికి ॥ 71

కం॥ ఈరీతిఁ బగఱమీఁదట
నారూఢిన్ దండువెడలి యల నీతివిధిన్
ఘూరమణుఁడు వర్తించిన
వైరిసమూహముల గెలిచి వర్తిలునెంపున్ ॥ 72

## స్కంధావార నివేశనప్రకరణము

కం॥ బలిమిం దనయరిపురిచెం
తలకుం జని విడియఁదగినతావున విడియన్
వలయును బాళెముదిగునే
ప్పలుగలిగిన రాజు శత్రుభూపతులధరన్ ॥ 73

సీ॥ నాల్గువాకిళ్ళచే నలువొంది చౌకమై
ఘనమును కొంచెంబుఁగాక పనరి
యగడితలనుకోట నట్టళ్ళఁ జెలువొంది
విపులౌ వీధుల వినుతికెక్కి
యర్ధచంద్రునిరీతి నైనను మఱియును
జతురస్రమైయుండు సరణినైన
విడివిగానైనను గడు వర్తులపుగనైన
నాలోనఁ గల భూమియును వెఱింగి

గీ॥ విమతుపురిచెంతఁ బాళెంబు విడియుచోట
మించు *నౌకయగారంబు నిర్మించవలయు
సాధుపులు మెచ్చ నచట నెచ్చరికె తెచ్చ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 74

సీ॥ కోటలో బలము దాకొన విడియింపుచోఁ
గోటకు జలమున్న చోటునడుసు
గఱుసంమన వీధి వాలగోల మాత్రంబు
విడిచి యచ్చట బైలుపడక నిండి

---

* నౌక్యయరాబ.

కోనియుండి చాలమించినపార్శ్వములు గల్గి
రక్షితం బగుచును గక్షపుటము
సనుప్పన మూలలై యట సూర్యసోమవీ
థులు విరుపులుగాఁగ నలరఁజేసి

గీ॥ వాస్తుశాస్త్రక్రమంబుల వైపు దెలిసి
విమతుపురిచెంతఁ బాళెంబు విడియుచోట
నెట్లు బలముల విడియించ నెఱుఁగవలయు
నితిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 75

క॥ పాళెముసడుచక్కి మహా
మూలబలము చుట్టుఁగలిగి ముందఱ నడుమన్
మేలిమియగుభండారము
చాలఁగలుగు నగ రొనర్పఁ జను నెచ్చోటన్ ॥ 76

క॥ ఇలఱేఁడు నగరిచుట్టును
బలియించఁగవలయుఁ బ్రాఁతప్రజఁ గైజీత
మ్ములఁగూటము మిత్రబల
మ్ముల శత్రుబలంబు నడవిమూఁకను వరుసన్ ॥ 77

వ॥ తత్క్రమంబు. 78

సీ॥ నరనాథమణి తననగరికిఁ జుట్టును
మునుమున్నుగాఁ బ్రాఁతమూఁక నిల్పి
యాతదువాతఁ గైజీతంబు విడిపించి
యాకడఁ గూటపుమూఁక నిల్పి
యావల మిత్రసైన్యంబుల విడియించి
దానియవ్వల శత్రుసేన నిల్పి
యందున కవ్వల నడవిమూఁకల నిల్పి
యావల జీతంబు లంది కొల్పి

గీ॥ తొలుతఁ బనులకువచ్చి యాప్తులను క్రూరు
అనుచుఁ గుక్కలు గలిగినయట్టి వేఁట
కాండ్రు చుట్టును విడియింపఁగా వలయును
క్రమము దప్పక నీతివిక్రమము మెఱయ ॥ 79

## రాజాభిరక్షణకై సైన్యావసానము

ఆ॥వె॥ అధిపు నగరిచేరువందు నుండఁగఁదగు
నాప్తరక్షితంబు లగుచుఁ దనరి
పేరు గలిగినట్టి పెద్దయేనుంగులు
నధిక జవముగల్గునశ్వములును ॥ 80

కం॥ అంతఃపురపరిచారకు
లెంతయుఁ దమి విచ్చుఁగత్తు లేమఱక మహీ
కాంతుని గావఁగవలయును
సంతతమును జాలిరొప్పు సన్నాహసమునన్ ॥ 81

కం॥ మేటియగు నాప్తుఁ డెక్కిన
పోటేనుఁగు జవము కలిమిఁ బొలిచిన హయముం
బాలించి నగరివాకిటి
చోటనె మెప్పు దుండవలయు జోక చెలంగన్ ॥ 82

కం॥ దళవాయి మున్నుగాఁగల
బలమం దొక కొంత యేరుపడి యత్నముతో
వెలుపటఁ జుట్టును దిరుగన్
వలయును రేలందుఁ గడు నవారితశక్తిన్ ॥ 83

కం॥ వేగము బలమును గలిగిన
వేగులవా రెల్లవేళ విమతులచర్యల్
బాగుగఁ దెలియుచుఁ దా మతి
వేగమె రాఁబోవవలయు విభునకుఁ దెలుపన్ ॥ 84

చం॥ వెలిపగు దాటిక్రొవ్విరులదండలు గట్టినతోరణంబులుం
బలుపగు పంచనంబులును బాణము లాదిగఁ గల్గు యంత్రముల్
వళుపగు తెక్కెముల్ గలుగు ద్వారము లాప్తులఁ గావఁజేయఁగా
వలయు నృపాలశేఖరుఁ డవారితపూరితకీర్తిసాయుఁడై ॥ 85

### జాగ్రదవస్థిత్యావశ్యకత

కం॥ పోవుచు వచ్చుచు వాకిటి
కావలివారలకు నెఱుకఁగా సకలజనుల్
పోవలయు వైరిమాతలు
భావిభునసుమతినె యుండి పోవఁగ వలయున్ ॥ 86

గీ॥ రిత్తకోలాహలంబులు రిత్తహాస్య
ములును జూదంబులును బానములును మాని
సవరణల మించి యుత్సాహసహితు లగుచు
బలము తెవ్వేళఁ గనుగల్గి పరగవలయు ॥ 87

కం॥ తనకోటకు వెలుపలి దెసఁ
దనబలము చరించుభూమిఁ బదవక వైరుల్
మొనసి చరియించుభూములె
జనపతి చరియింపవలయుఁ జతురుం డగుచున్ ॥ 88

వ॥ అది యెట్లన్నను. 89

### కంటకాదిభూదూషణము

కం॥ ఒక్కొక్క యెడఁ బదు పాఁతం
దొక్కయెడఁ ముండ్లకంప తొకయెడ ముల్కుల్
మిక్కిలి గలిగించి రిపుల్
ద్రొక్కెడి చోట్లెల్లఁ జెఱుప దొరకొనవలయున్ ॥ 90

కం॥ తన బలములు మెలఁగుటకై
తనబడిపనివారిచేతఁ దరువులు బుట్టన్
ఘనమగు మొద్దులు శిలలుఁ
గనుపట్టకయుండ సమము గావింపఁదగున్ ॥ 91

వ॥ అందు నుత్తమమధ్యమాధమ భూములు వివరించెద. 92

ఉత్తమాది భూభేదములు

సీ॥ తనమూఁకలకు నెంతయు మెల్గఁగావచ్చి
వైరిమూఁకలకు రావైపుగాని
దేశ ముత్తమమగు దేశంబు మఱియును
బగఱకుఁ దన కొక్కభంగియైన
దేశంబు మధ్యమదేశమై చెలువొందు
వైరిమూఁకలకు రావచ్చియుండి
తనమూఁకకెల్ల నెంతయుఁ బోవఁగారాని
దేశంబె యధమప్రదేశ మటులఁ
గీ॥ గనుక నుత్తమదేశంబె తనకు వలయు
నది దొరకకున్న మధ్యమమైన దైన
వలయు నదిగాక చెఱసాలవంటిదైన
యధమదేశంబు వలదు ధరాధిపతికి ॥ 93

వ॥ మఱియు నపజయసూచక ప్రకారంబు లెట్లన్నను. 94

నిమిత్తజ్ఞానప్రకరణము - అపజయసూచక నిమిత్తములు

సీ॥ గ్రహముసోఁకిన లీలఁ గళవళ మొందుట
తెవులుచేఁ బీడలఁ దవులుటయును
గారణంబులులేక కడుభీతి నొందుట
మంచును దుమ్మును ముంచుకొనుట

కకుదూభ్రమమై దొడ్డగాలి పైకొనుటయు
సూరకె పెక్కెంబు లుర్విఁబడుట
తమలోనఁ దమకు ద్రోహములు గల్గుటయును
వాద్యముల్ లెస్సఁగా వాఁగమియును
గీ॥ మిగుల మదిలోన సూరక దిగులుపడుట
నేల యదరుట చుక్కలు రాలుటయును
దొంగలు మింటను గత్తులఁ దొడముటయును
గలుగు పాశెంబు విజయంబు గానదండ్రు ॥ 95

సీ॥ చాల దాపట నక్క యూలఁబెట్టుటయును
ఘనమైనతాపంబు గలుగుటయును
ప్రాఁకులపైనుండి మూఁకలుగా వచ్చి
కాకులు గ్రద్దలు గ్రమ్ముకొనుట
క్రమ్ముకో రాజసత్త్రంబులందును
గ్రహరగ్రహంబులు గూలుటయును
గారణంబేమియుఁ గనఁగక మదమింకి
యేనుఁగుల్ గదలక మ్రానుపడుట
గీ॥ తురగచయములు గదలక లొట్రుకొనుట
సూర్యనందనుమొండెముల్ చూడఁబడుట
నెరసి నెత్తురువానలుఁ గురియుటయును
గలుగుపాశెంబు విజయంబుఁ గానదండ్రు ॥ 96
వ॥ మఱియును జయసూచకంబు లెట్లన్నను. 97

విజయసూచక నిమిత్తములు

సీ॥ తేజీలసకిలింత లోటమై చెలఁగుట
కాంతలుఁ బురుషులు సంతసిలుట
భేరీరవంబు గంభీరమై యుండుట
పరిబృంహితంబు లగ్గలము లగుట

పుణ్యాహమంత్రముల్ పొలుపు వహించుట
పాటలు నాటలుఁబ్రబలు టెందు
నీతిబాధలులేక యింపొంది యుండుట
సంతతోత్సాహముల్ సంఘటిలుట

గీ॥ సారె జనులెల్ల విజయంబు గోరుటయును
వాన లటుగల్గి ధూళిచే నూనకుంట
గ్రహము లనుకూలగతులను గాంచుటయును
గలుగుపాళెంబు విజయంబుఁ గను నటంచ్రు ॥ 98

సీ॥ మెల్లనితావులఁ జల్లగాడ్పులుగల్గి
సంతోషములఁజెందు జనులుగల్గి
పక్షిజాతులమంచిపల్కులు వినఁగల్గి
చెలఁగుచునుండు మిత్రులునుగల్గి
వందిమాగధశుభవాక్యచాతురిగల్గి
వలఁగొను శిఖల వహ్నులఁజెలంగి
మదధారల నెసంగు మాతంగములుగల్గి
పలపట నక్కకూఁతలును గల్గి

ఆ॥ వె॥ యలర నెందు దివిని నంతరిక్షమునందు
నవనితలమునందు నద్భుతముగ
నురక పొడమునట్టి యుత్పాతములులేక
వెలయుపాళెమునకుఁ గలుగుజయము ॥ 99

కం॥ పాళెంబున కపశకునమె
చాలంగాఁ గలిగెనేని జయములు దొలఁగుఁ
పాళెమున మంచిశకునమె
చాలంగాఁ గల్గెనేని జయముం గలుగున్ ॥ 100

కం॥ ఇలలోపల శకునంబులె
దెలుపును జయ మపజయంబుఁ దేటపడంగా
నిలతేఁ దటుగన శాస్త్రము
తెలివిన్ శకునంబులెల్లఁ దెలియఁగవలయున్ ॥ 101

కం॥ మునుమున్ను మంచిశకునము
లనువుంగని విమలచిత్తుఁ డగుపురుషుఁడు పూ
నినకార్యము సఫలం బగు
ననుచుం బలుకుదురు ప్రాజ్ఞు లనువా రెందున్ ॥ 102

కం॥ బలమును దైవబలంబును
సల్ప్రజ్ఞయు నిశ్చయంబు యత్నము సహా
యులకలిమి నెట్టివానికి
గలుగున్ ధరనట్టివాఁడు కడు జయ మందున్ ॥ 103

గీ॥ పనుపు దివసంబు నీళ్ళును గట్టియలును
జేకురకయుంట చుట్టముల్ రాకయుంట
రేలు బగలును లాచి కగ్గోయ వడుట,
విషదులకు మృత్యువగు వీని విడువవలయు ॥ 104

కం॥ ఈరీతి దండు విడియుచు
సారె శుభాశుభము లిచ్ఛశకున స్థితులం
దారెఱుఁగవలయు నృపతులు
వైరులయశుభములు దెలియవలయున్ పలుసన్ ॥ 105

ఉపాయ వికల్ప ప్రకరణము

కం॥ ధృతి యుద్యోగము సత్త్వం
బతులితమతి దేవతాసహాయత గలభూ
పతి సప్తోపాయంబుల
గతు లెఱుఁగుచుఁ జొనుపవలయు గడిఁదిరిపులపైన్ ॥ 106

కం॥ చతురంగబలముకంటెను
ప్రతిభందగు మంత్రబలము భండారము సు
స్థితిమించుఁ గాన వీననె
యతులితగతి నెఱవవలయు సహితుల నెల్లన్ ॥ 107

## సప్తవిధోపాయములు

కం॥ ఇలలోన సామదానం
బులు భేదము మఱియు దండమును మాయోపే
క్షయు నింద్రజాలమనఁగాఁ
గలిగిన యీయేడుపాయగతు లంద్రు బుధుల్ ॥ 108

వ॥ అదియెట్లన్నను దత్ప్రకారంబు క్రమంబున వివరించెద. 109

## సామ స్వరూపము

సీ॥ మనసుగాఁ బ్రియమున మ్రొక్కి లోనర్చుట
పెద్దలసుగుణముల్ పేరుకొనుట
వారిసత్కర్మముల్ వరుసతో నెన్నుట
తొలుతటి సంబంధములు దెలుపుట
తనకుఁ జుట్టఱికంబుఁ దానె కల్పించుట
యిరువురయుపకార మెన్నికొనుట
యన్యోన్యగుణముల సందందఁ బొగడుట
మీఁదటిఫలములఁ దాఁ దెలుపుట

గీ॥ మంచితనమునఁ గట్టుకోలాటలాడి
యేను నీవాఁడ నని తను నిచ్చికొనుట
యివియె సామప్రకారంబు లిట్టి వెల్ల
నెఱుకగలరాజు వేర్వేర నెఱుఁగ వలయు ॥ 110

పంచవిధ సామప్రకారములు

వ॥ ఇట్టి సామప్రకారంబు లన్నియునుం గూడి యైదు విధంబులై యుండు నది యెట్లన్నను పరస్పరోపకార ప్రదర్శనంబును, పరస్పరగుణకీర్తనంబును, పరస్పర సంబంధకథనంబును, సుత్తమ కాలఫలప్రదర్శనంబును, నేను నీవాఁడనని తను నిచ్చుకొనుట యుంగా, మఱియు నది ప్రయోగించు తెఱంగెట్లన్నను. 111

సామప్రయోగవిధానము

గీ॥ ఎలమి నిరువుర యుపకార మెంచి మించు
గుణముఁగొనియాడి సంబంధగణన సేసి
మీఁదటిఫలంబు గనఁబల్కి మీకు నేను
నగు లటనుచును సామోక్తిఁ బలుకవలయు ॥ 112

గీ॥ అరసి బహుమాన మొనరించు నట్టికరణి
నాదరంబునఁ గనుఁగొనునట్టి సరణి
నమృతకణములు చిలుకుచున్నట్లు నేర్పు
కులుకుచుండఁగ సామంబుఁ బలుకవలయు ॥ 113

కం॥ సామంబుగ నిజ మాడుట
ప్రేమం గొనియాడుటయును బ్రియ మాడుటయుం
దా మఱి ప్రార్థన సేయుట
యీమార్గము మనుజపతుల కెఱుఁగగవలయున్ ॥ 114

కం॥ నేమమునఁ గార్యసిద్ధికి
సామమె యొనరింప వలయు సకల మగునెడన్
సామమునఁ గార్య మగు నని
ధీమంతులు సంతతంబుఁ దెలిపెదుకతనన్ ॥ 115

కం॥ సురలసురులు మును సామ
స్ఫురణన్ శరనిధి మథించి శుభ మొంది రిలన్
ద్వరితమున సామ మొల్లక
కురురాజకుమారు లవని( గూలరె జదులై ॥ 116

వ॥ సామసాధ్యులకు. 117

సీ॥ అలసుని శౌర్యము దల(గినవానిని
గడునుపాయంబులు చెడినవాని
క్షయముచే వ్యయముచే( బయనంబుచేత( బా
నెందు సంతాపంబు( జెందువాని
బవరంబులోపల( బాఱిపోయినవాని
మూర్ఖుని భయమున మును(గువాని(
బడుచువానిని ధర్మపరు(డై నవానిని
నతివలయందు ముందైన వాని

గీ॥ చెరుగువానిని నేస్తంబుచేయువాని
మంచిమతిగల్గువాని సాధించవలయు
మంచిమాటలచేత లాలించి యెల్ల
వారి( దనవారిగా( జేయవలయు( బతికి ॥ 118

కం॥ పలుతెఱ(గుల కార్యములకు
నిలలో సాధకములైన యిట్టియుపాయ
ములలో సామమె పేశలు
దెలియుచు నొనరింపవలయు ధీమంతులకున్ ॥ 119

వ॥ దాన ప్రకరణము. 120

సీ॥ అధికంబు మధ్యమం బల్పంబుగా ధన
మిచ్చినట్లనె మళ్ళ నిచ్చుటయును
ధనసాహ్యమెవ్వియుఁ దానియ్యకయె మున్నె
కైకొన్న సమ్మతిఁ గని యలరుట
యరుమలై మించినయట్టి పదార్థంబు
లింపు మీఱంగఁ దా నిచ్చుటయును
దా నప్పు లిచ్చిన ధనములు దక్కఁగా
నప్పుణబెట్టి తా నప్పగించు

గీ॥ దస్యులధనంబుఁ గైకొన నడరెనేని
యందులకు సమ్మతించి సహాయుఁడగుట
యిట్టు లైదువిధంబుల నెనయుదాన
రీతు లెఱుఁగంగవలయును నృపవరుండు ॥ 121

కం॥ భూనాధుఁడు లోభముగల
వానిన్ మఱి పేదయైనవాని నెఱుఁగుచున్
దానోపాయముచేతనె
తా నెంతయు వశముఁ జేయఁ దగు నెచ్చోటన్ ॥ 122

కం॥ దానవసురుఁ డింద్రునిచే
దానంబున శాంతిఁ జెందె ధర నటుగానన్
దానముననె కలహంబులు
మానుపఁగావలయు బుద్ధిమంతుల కెల్లన్ ॥ 123

కం॥ తనయాతుబిద్దకును ద
ప్పొనరించినఁ జూచి కోప మొదవినశుక్రున్
మును వృషపర్వుఁడు దానం
బున మాన్చెం గాన నదియె ముఖ్యం బెందున్ ॥ 124

కం॥ కలహము మాన్పెడుకొఱకై
బలిమిన కీవలయుఁ బ్రియముఁ బల్కుచునైనా
నలదుర్యోధనుఁ డీయక
చలమునఁ గులమెల్లఁ గూల్చి సమయఁడె తానున్ ॥ 125

కం॥ జనపతి దానోపాయము
మునుగా సామంబు భేదమును గావింపం
జను దానముచేతను మిం
చినసామము భేద మర్థసిద్ధిం జేయున్ ॥ 126

ఆ॥వె॥ తృణముపోలె నీవి నెసఁగనిసామంబు
గార్యసిద్ధిచేయఁగాన రెండు
నీవి చూపఁదేని యిల్లాలు దనకైన
రిత్తమంచిమాట బత్తిగనునె ॥ 127

వ॥ భేదోపాయప్రకరణము. 128

కం॥ అనురాగంబును నెయ్యం
బును జెఱచుట చాలఁగినుకఁ బుట్టించుట జం
కెన చూపి తలఁక చేయుట
యన భేదము మూఁడుదెఱఁగులై చెలువొందున్ ॥ 129

వ॥ భేదోపాయప్రయోగము. 130

కం॥ తనువాని కమ్ముకొనుగతిఁ
దననేర్పులు చాల మెఱసి తా హితచర్యం
దనరుచు నరి భేదింపం
జనుఁ జల్లనయైన నీళ్ళు శైలముఁబోలెన్ ॥ 131

కం॥ తమవారు శత్రుచే భే
దము నొందక యుండఁ జేసి తా శత్రుల భే
దముఁ జెందఁ జేయవలయున్
సమకొని తమపక్షమునకు శాంతి ఘటిల్లన్ ॥ 132

కం॥ జననాథుండు పురోహిత
జనులన్ మంత్రుల నమాత్యజనులను యువరా
జును భేదింపం జను ని
ట్లనువుగ భేదించెనేని యరి నెకు నెంచున్ ॥ 133

కం॥ జననాథమణికి మంత్రియు
ననుఁగవ యువరాజమాత్యగణములు భుజముల్
గన వీరలయం దొకఁడై
నను భేదముఁజెంద రిపుఁడు నాశముఁ జెందున్ ॥ 134

కం॥ మును బలుచెఱఁగుల నదకల
చెనుపొందినపై రిపులఁ భేదింపంగాఁ
దను భేద మొంది యాతఁడు
తననెల్లను దానె చెఱుచు దావాగ్నిగతిన్ ॥ 135

కం॥ తనశత్రునిదాయాదినిఁ
దనశత్రునిచనపరియును దగ నమ లిటు వీ
రిని భేదింపన్ వలయును
దినయంబున భేద మొందు తెలలకయుండన్ ॥ 136

చం॥ ఘనమున మించి శత్రునెడఁ జాలఁగఁగోపము రేఁచమాన్పనో
పినఁ దను భేదముంబఱచి పెంపెసఁగం దెలియంగ నొప్పు స
జ్జనుఁడును దుర్జనుం దగపట సజ్జనుఁడైనను బూనుకార్యముల్
దనరఁగఁజేయు దుర్జనుఁడు దా ధనకాంక్షలుఁగూల్చు నిర్వరన్ ॥

చం॥ జనవిభుఁడప్పు డించుక యొసంగుచు నాశలు చాలఁ జూపుచున్
దనరఁగ నిందు నందును ఘనంబుగ జీతముఁ జెందువారిచే
ననువునఁ జొచ్చినర్థిఁగుఱై తగుభేద్యుల నెల్ల భేదముం
గన నొనరింపఁగావలయుఁ గాలము దేశముఁ దా నెఱుంగుచున్ ॥

వ॥ ఇట్టినాలుగుదెఱంగుల భేద్యులెట్టివా రన్నను విభునిచేత శీతంబులు చెందని లుబ్ధుండును, సవమానంబు చెందిన యభిమానియు, వెఱపింపఁబడిన భీతుండును, గోపింపఁబడిన క్రుద్ధుండును, ననంబరగుచుందురు. తత్ప్రకారంబు గ్రమంబున వివరించెద.

సీ॥ అపులఁ బెట్టింప నెఱుగుచుండెడువాఁడు
మిగులంగఁ బేదయై నొగులువాఁడు
పతిచేతఁ జెఱుపఁగాఁబడిన ధర్మంబును
గాపంబు సర్దంబు గలుగువాఁడు
మెఱుపట సౌఖ్యంబు గలిగినవాఁడును
నధికభోగముఁ గోరునట్టి వాఁడు
వసుధ నెంచఁగ లుబ్ధవర్గమై చనుచు
రిట్టివారల మార్గ మెల్ల నెఱిఁగి
గీ॥ యర్థములయందు మిగులఁగ నాసఁ గొల్పి
మఱియు నంచుసుఁ దగినట్టి మాట లాడి
భేద మొందించవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 140

॥ అభిమాని ప్రకారంబు. 141

సీ॥ కలహంబుపైఁ గాంక్ష గలిగియుండెడువాఁడు
సాహసవృత్తి నెసంగువాఁడు
ధనముచేఁ గులముచేఁ దనకు నీడైనవాఁ
డెంచ లేఁడంచు గర్వించువాఁడు
పూజార్హుఁడై యుండి పూజనొందని వాఁడు
నేపాటిమాపైన నెదయువాఁడు
పరిగానివానితో సాటిచేసినఁ గోప
మంది సమర్థుఁడైనట్టివాఁడు

గీ॥ వసుధలో వీరి నభిమాని వర్గ మండ్రు
క్రమముతోడుత వీరిమార్గంబు దెఱిఁగి
భేద మొందించవలయును దెంపుఁజూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 142

వ॥ భీతవర్గ ప్రకారంబు. 143

సీ॥ పతితోడఁ గోపించి పగఁబెట్టుకొనువాఁడు
పిఱికిదనంబున బెగడువాఁడు
పతిచేతఁ గోపింపఁబడియుండువాఁ డెండ
వలనిదాయాది యైనట్టివాఁడు
తా నేరములు సేసి దలఁకుచుండెడివాఁడు
గడునగ్రప్రియమాడఁ బడినవాఁడు
వెలివేయఁగాఁబడి వెతలఁ జెందినవాఁడు
గణుతింప భీతవర్గం బటండ్రు

గీ॥ వీరిమార్గంబు దెఱిఁగి వివేకి యగుచు
మఱియు నందుకుఁ దగినట్టిమాట లాడి
భేద మందించవలయును దెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 144

వ॥ క్రుద్ధవర్గ ప్రకారము. 145

సీ॥ ఇయ్యంగఁదగు నర్థ మియ్యక యెంతయుఁ
గాలంబు గడపఁగాఁ గడఁగునతఁడు
నవమాన మొందిన యభిమాని యగువాఁడు
లేనినిందలకు లోనైనవాఁడుఁ

గానుకత్తై యరికట్టఁగాఁ బడువాఁడుఁ
దన బంధువుల నొంపఁగనియువాఁడుఁ
గారణంబేమియుఁ గలుగక ధారుణీ
పతిచేత విడువఁగాఁ బడినవాఁడు

గీ॥ వసుధలో నెంచగాఁ గ్రుద్ధవర్గ మగుదు
రిట్టివారికిఁ గోపంబు రెచ్చఁజేసి
భేద మొందింపవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు॥ 146

సీ॥ ఆదాయమునకున్నై వ్యవహారమూఁదఁగా
గెలిపింతు నని తానె పిలువఁ బంచి
యోడించినను గోప మొందియుండెడు వాఁడు
పనిలేనిపని యక్షపాటుచెంది
మనసులో నెంతయుఁ గినిసియుండెడువాఁడు
పనిగల్గి యరికట్టఁబడినవాఁడు
* (భార్యాధనములఁగోల్పడ్డవాఁడును నాత్మ
దోషంబుచేఁ గడుదుఃఖితుఁడును)

గీ॥ వసుధలో నెంచఁగాఁ గ్రుద్ధవర్గ మగుదు
రిట్టివారలఁ గోపంబు రెచ్చఁజేసి
భేద మొనరింపఁగాఁదగుఁ బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు॥ 147

ఉ॥ ఈవరుసన్ విరోధియొక నెంతయు భేదముఁజెందఁజేసి తా
నావలవచ్చువారలకు నప్పుడ కోరిన వెల్లనిచ్చి సం
భావనసేయఁగా వలయు మన్ననతోఁ దనయట్టివారలన్
భూవరుఁ డెంచు భేదమునఁ బొందక యుండ నొసర్పఁగాఁదగున్

* (...... ... .....)

## భేదోపాయములు

కం॥ ఇచ్చుట యాశలు చూపుట
మచ్చిక మాటాడుటయును మన్నించుటయున్
హెచ్చినభయంబు చూపుట
నెచ్చులు భేదంబుసేయునేర్పులు జగతిన్ ॥ 149

కం॥ మునుభేదముఁ బొరయింపుచు
జనపతిపై స్వంబుమీఁద దండ మొనర్పన్
దిను దానె విఱుగుచుండును
ఘనముగ నుసిపురువు దినినకట్టియవోలెన్ ॥ 150

కం॥ బలవంతులతోఁ గలహం
బలవడ భేదమున గెలువ నగుఁ జండామ
ర్కుల భేదపఱచి దివిజులు
గెలువరె దానవుల నెల్ల క్షితి నుతియింపన్ ॥ 151

వ॥ దండోపాయ ప్రకరణము. 152

కం॥ అలమటఁబెట్టుట చంపుట
కలిగినధనమెల్ల నొరిచి కైకొనుటయుఁగా
నిల దండము మూఁడు దెఱం
గుల వెలయు నటంద్రు నీతికోవిదు లెల్లన్ ॥ 153

వ॥ అందు వధరూపంబగు దండంబు ప్రకాశంబు నప్రకాశంబన రెండు తెఱంగులై యుండు నది యెట్లన్నను. 154

కం॥ జగతిని జారులు చోరులు
నగువారిని దనకు శత్రులగువారి మదిం
దగ నెఱిఁగి తాఁ బ్రకాశం
బుగ దండ మొనర్పఁ జెల్లు నధిపతి కెంటున్ ॥ 155

కం॥ సేనాపతులను బురిఁగల
మానవులను దనదుసీమ మనుమానవులం
దా నొనగూర్పఁగ వలయును
దానమునట భేదమునను ధరణీశుఁ డిలన్ ॥ 169

చం॥ కలఁకలు బుట్టఁజేసి తిరుగంబడియుండుకులంబువారి చెం
తల గడినుండురాజుల వసంబుల [1] [నుండెడివారి భేదిపుం
జెలుపున దండపై ఖరిని) చిక్కఁగఁజేయఁగ నొప్పునేటుపుల్
బలియఁగ నన్యులం దగునుపాయముచేఁ జను మట్టుపెట్టగన్ ॥

వ॥ ఇది చతురుపాయస్వరూపంబగు నింక మాయోపేక్షేంద్రజాలంబుల
ప్రకారంబులు గ్రమంబున వివరించెద. 171

మాయాప్రకారముః

సీ॥ జనులు కంబములలోనను దేవతాప్రతి
మలలోపలను జొచ్చి మెలఁగుటయును
గాంతాదిరూపముల్ గైకొనుటయు రాత్రు
లందుఁజీఁకటుల మహాద్భుతముగఁ
గౌరవిదయ్యముల బాగున మించుటయును భే
తాళుని చందంబుఁదాల్చుటయును
బులుల నక్కల మెలుఁగుల రూప మొందుట
యివి మనుజులమాయ యెంచి చూడఁ

గీ॥ గామరూపంబుఁబూను టింగలము సంప
కోలలును రాళ్ళ నీళ్ళను గురియుటయును
గాలి గట్లును మొగిలు చీకట్లు గలుగఁ
జేయుచుండుట దేవతామాయ యగును ॥ 172

---

1 [.. ...... ... ...... .......]

గీ॥ పడఁతిరూపున మును సహ్యబలునిఁ జంపె
మహిని భీముండు మానవమాయచేత
నలుఁడు ప్రచ్ఛన్నరూపుఁడై కొలిచె దేవ
మాయఁగైకొని ఋతుపర్ణమనుజవిభుని ॥ 173

గీ॥ అవని నన్యాయమును బోరువ్యసనములును
నదరుచుండఁ బ్రవర్తించు నట్టివాని
నరసి మాన్పక యుండిన నగు నుపేక్ష
యిదియు మూఁడు దెఱంగులై యిటుల వెలయు ॥ 174

సీ॥ కామాంధుఁడై ముందు గానక గర్వించి
ద్రౌపదిపై కాంక్ష దసరుసింహ
బలుని భీముఁడు రేయి పట్టి వధింపుచో
విరటుఁ డుపేక్షించి విడుచుటయును
మునుపు హిడింబుఁ దా మోహించి భీముని
వరియించి యతనిపై వాంఛఁజేసి
తనతోడఁబుట్టిన దనుజు హిడింబుని
నురక యుపేక్షించి యుండుటయును

గీ॥ ననఁగ నీగతి నన్యాయమైన యెడల
వ్యసనములయెడ జగడంబు వచ్చునెడల
నగు నుపేక్షింపఁ దనవారినైన నెందు
నీతిమార్గం బెఱిగినన్నృపవరుండు ॥ 175

ఇంద్రజాలప్రకారము

సీ॥ ఘనముగా మాయచే గట్టులు చీఁకట్లు
బెనువాన లగ్నిఁగల్పించుటయును
దవ్వుల నున్నతధ్వజములు గలిగిన
సేనలఁ గన్పడఁ జేయుటయును

దునకలు మొంతెములు దుండంబులై పరి
సొరిగిన పూఁకలఁ జూపుటయును
నదరి సముద్రంబు లటుముంచు కై వడిఁ
బెల్లుఁగా వెల్లిఁ గల్పించుటయును
గీ॥ ననఁగఁగల యింద్రజాలంబు లద్భుతముగ
వైరిరాజులు భయ మందవలసి నేర్పుఁ
దనర నొనరించపలయు నుదారలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 176

గీ॥ దైవమాయా విలాసంబు దడవు నిలుచు
నైంద్రజాల విలాసంబు లెల్ల నపుడె
గానుపించును నామీఁదఁ గానరాక
పోవు నివి దెలియందగు భూమివిభుఁడు ॥ 177

ఉ॥ నీతివిధిజ్ఞుఁడైన ధరణీపతి యీగతి నీయుపాయముల్
చాతురితోడ శత్రువులసైన్యమునందును నాత్మసైన్యమం
దాతతరీతిఁ జేయఁదగు నాగతిగాక యుపాయశూన్యుఁడై
యేతటి నూరకున్నయెడ నెందును నంఘుఁదనంగఁ జేద్పుటా॥

చం॥ అనలములోన నుండి తనరారుసువర్ణము బట్టుకాపిసం
గొని బిగఁబట్టినందునకు గొబ్బున జారక చిక్కుపాడ్కి శ
త్రునియెడ నున్నసంపదయు రూఢిమెయిందగు నీయుపాయప
ద్ధనమునఁ బూనిభూవిభుఁడు దా బిగఁబట్టినఁ జిక్కుఁ గ్రక్కునన్॥

ఉ॥ శ్రీరఘురామపాదసరసీరుహభక్తినియుక్తమానసో
దారధరాధురావహనదక్షిణ దక్షిణబాహుదండవి
స్తారయశస్సరోవరలసన్నవనీరజకోరకాకృతి
స్ఫారసరోజజాండనయచారవిచక్షణ భద్రలక్షణా ॥ 180

కం॥ విమతహరణార్ధయాత్రా
క్రమకౌశల విజయశకునగతినిర్ణయధా
గ్ర్యామలమతి సారపటువి
క్రమ సప్తోపాయచతుర ప్రఖ్యాతజయా ॥ 181

తోటకం॥ పటుధాప్రతిఘాభరణాభరణా
పటువాక్పణనజ్జనతాభినుతా
ఘటితాంచితలక్షణలక్ష్యరసో
త్కట కావ్యకళాకరణాదరణా ॥ 182

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజసగోత్ర జక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు యాత్రాభియోక్తృపర్యనప్రకారంబును, స్కంధావారనివేశనిమిత్త జ్ఞానంబును, సప్తోపాయ వికల్పంబునున్నది సప్తమాశ్వాసము.



# ఆంధ్ర కామందకము

## అష్టమాశ్వాసము

కం॥ శ్రీశ్రితమందిర రఘుపతి
విశ్రుతగుణవినుతిచతుర విమలరుచియశో
మిశ్రితలోక సుధీనిక
రాశ్రయ కొంద్రాజువెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### సేనావివరము

ఆ॥వె॥ సామదానభేదసరణులు శాత్రవ
వరులయెడల నడపవలయు వరుస
నందుఁ జక్కఁగానియపుడు దండోపాయ
శక్తిఁ జూపవలయు జనవిభుండు ॥ 3

చం॥ తనకుఁ బ్రసన్నభావమునఁ దారకలుం గ్రహముల్ చరింపుచో
వినయముతోడ దేవతల విప్రులఁ బూజలుసేసి సంతసం
బెనయఁగ నాఱు చందముల నెన్నికకెక్కుబలంబులం గ్రమం
బున నడపింపుచుం గదలి పోఁదగు భూపతి శత్రుమీఁదటన్ ॥ 4

### షడ్విధబలప్రకారము

సీ॥ కైజీతమగు మూఁకకంటెను గల్మితే
ములకు లోనగుప్రాంతమూఁక మేలు
కూటంబుకంటె నెక్కుడు స్వామివశమైన
జీతంబుఁ దెందు కైజీతగాండ్రు

మిత్రసైన్యముకంటె మేలగుఁ దనసీమ
సమసుఖం బొందు కూటములమూఁక
శత్రుసైన్యముకంటె మిత్రసైన్యము మంచి
దేకార్థమతి నెయ్య మొనయుకతన

తే॥గీ॥ మిగులఁ జెదుగు లగుచు మెలఁగి నిల్కడలేని
యడవిమూఁకకంటె నరయ మేలు
శత్రుసైన్య మిట్టిచందంబు బలముల
తారతమ్య మెఱుఁగఁ దగు విభుండు॥ 5

వ॥ అది యెట్లనినను మఱియు విభునిచేత సత్కారంబులు చెందుట, యతనియం దనురాగంబు గలిగియుంతుట, సహాలాపంబులు గలిగి వర్తించుట, బహుకాలంబుననుండి యతనితోడంగూడి కలిమిలేములకు సుఖదుఃఖంబులకు లోనైనవారగుటం జేసి ప్రాఁతవారలు కైజీతంబుమూఁకలకంటెను మేలు. ఆసన్నవర్తులై యుండుచుఁ జెప్పినపని జెప్పినట్ల సేయుచుండుకతనను తమ జీవనంబులు భూవిభునియధీనంబులగుటం జేసి కైజీతంపు మూఁక కూటపుమూఁక కంటెను మేలు. సమంబుగా సంతోష రోషంబులం జెందుట విభునకు సుఖంబుగలిగినం దాము సుఖవృత్తిఁ జెందుట, యతనిదేశంబుననే నిచ్చలు మెలంగుటం జేసి కూటపుమూఁకలు మిత్రబలంబుకంటెను మేలు. సమంబుగా దేశకాలంబుల నొనఁగూడి వర్తించుట, యిరువురు నేకప్రయోజనంబున నాసక్తిమెలంగుట, పరస్పర స్నేహంబు గలుగుటం జేసి శత్రుబలంబుకంటె మిత్రబలంబు మేలు. స్వభావంబున ధర్మపరులై పరధనంబులయందె లోభంబుగలవారై దుర్జనులై మాటపట్టుఁదప్పెడివారలైన యడవిమూఁకలకంటెను దను గొల్చు శత్రుబలంబులె మే లిదియునుం గాక. 6

సీ॥ అరిబలంబులు మఱి యాటవికులు విభు
సీమఁ దా మెప్పుడు జెఱుతు మంచు
నదను గోరుకయుందునట్టివారగుటను
దండయాత్రలు గల్గుతఱిని దెలిసి
తనవెంట వీరిఁ దోడ్కొని పోవఁగాఁదగు
నటులఁగాకున్న రాజ్యంబు నెల్ల
జెఱుపుచుందురు రందుచే శత్రువులకును
జయము నిశ్చయ మెట్టి సరవినైన
గీ॥ నరియుఁగాకున్నచో భేదమైనఁ గలుగుఁ
గావునను దండయాత్రలు గదలు నపుడు
వారివెంటనె తోడుకపోవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 7

వ॥ ఇట్టి షడ్విధబలంబుల చందంబు లెఱింగి దండు గదలునప్పుడు విభుండు దనవెంటనే తోడుకపోవువిధం బెల్ల నిపుడు తత్ప్రకారంబు క్రమంబున వివరించెద. 8

సీ॥ వ్యయమును దడవును క్షయమును గలయాత్ర
తనమూలబలముతోఁ జనగవలయుఁ
దడవును నాశంబుఁ దగులనియది యైనఁ
గైజీతములతోడఁ గదలవలయు
నరిమూఁక కడుఁగొంచెమై తడ వందని
యెడఁ గూటములతోడ నెత్తవలయుఁ
దనకులోనై ఫలం బొనగూర్చుమిత్రుతో
సమకార్యములయందె చనఁగవలయు
గీ॥ దుర్గములచెంతఁ గంటకాదులకు నెదుర
శత్రుబలములు మున్నుగాఁ జనగవలయు

సరులఘూములఁ జొచ్చుచో నడవులందు
నాటవికసేనతోఁ జను నర్హ మంద్రు ॥ 9

వ॥ ప్రాంతమూఁకలకు. 10

సీ॥ కడుదేవ యనురక్తి గలిగిన ప్రాంతమూఁ
కలఁజెంది శత్రుండు బలిసి యున్న
నతనికి సమబలంబై యుండునట్లుగా
క్షయము వ్యయంబును జాల నోర్చు
ప్రాంతమూఁకలఁగూడి పైనెత్తఁగాఁ దగుఁ
గదుదూరమగుఁ ద్రోవగలదియైన
దడపువట్టెడు నట్టిదండైనఁ దనచేత
బహుమాన మొందినప్రాంతమూఁక
గీ॥ లిలఁ గడలజెంది యాజికి నిలుచుఁగాన
ప్రాంతమూఁకలె ఘనమైనబలముతోడ
వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 11

సీ॥ తడవు వట్టెడునట్టి దండైన మిగులంగ
దండఁగల్గినయట్టిదండునందు
బలములు బహువిధంబుల నుండు కతమున
వ్యయమె క్షయం బోర్వనట్టి కతన
గమనప్రయాసము గల్గినకతమునఁ
దనప్రాంతమూఁకలు దక్క నితర
బలములయందు దెల్లఁ గలుగును భేదంబు
లటుగాన నిట్టిచో నన్యమైన
గీ॥ బలము నమ్మక నమ్మిక గలిగి కలిసి
బలిసి వర్తించు ప్రాంతమూఁకలనె కూడి

వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 12

సీ॥ కదనంబులకు నోర్చుకైజీతమగుమూఁక
ఘనముగాఁ దనకును గలిగెనేని
తనప్రాఁత మూఁక లెంతయుఁ గొంచెమై బల్మిఁ
గొనఁగూడఁగా లేక యుండెనేని
పగతు మూలబలంబు మిగులంగఁ గొంచెమై
చేవయు బలిమియుఁ జెందరేని
యతనిచేఁ గైజీత మందెడి మూఁకయు
నల్పమై యనురాగ మందెనేని

గీ॥ చాలఁ గల్గియు ననిసేయఁ జాలదేని
యపుడు కైజీతమొందు సైన్యంబుఁగూడి
వైరి మీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రా విధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 13

సీ॥ కడుఁదడవందక కనుపట్టు దండైన
నరయ దూరముగాని యట్టిదైన
నెవ్వేళ నమ్మిక నెనసి చేకూడుచుఁ
దనమూఁక భేదంబుఁ గనకయున్న.
నసమర్థభావంబు నందుచు నరిరాజు
దన కెందు లోకువై దనరియున్న
నప్రయాసమున మంత్రాజులచే గెల్పు
దనకుఁ గల్గెడు లీలఁ దనరియున్న

గీ॥ క్షయము వ్యయమును మిగులంగఁ గలుగదేని
యపుడు కైజీతమైన సైన్యంబులోడ

వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 14

వ॥ కూటపుమూఁకలకు. 15

సీ॥ కడు సధికంబుగాఁ గలిగిన యదియైనఁ
దనవెంటఁ దొడుకపో నానరెనేని
చెలఁగుచు బదలికల్ చెందని యదియైన
బహుముఖంబులుగాక పరగియున్న
పేరువదండైన చేకొద్దియై కార్య
ప్రయాసంబున నగుచునున్న
శత్రుఁడు కొంచెపుసైన్యంబుతో నున్న
నేమరుపాటున నెసఁగియున్న

గీ॥ నెట్టిచోటున మోసంబు నెనయకుండు
జాడఁ గూటపు మూఁకలతోడఁ గూడి
వైరిమూఁకల దండెత్త వలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 16

వ॥ మిత్రసైన్యమునకు 17

సీ॥ తనమిత్రసైన్యంబు ఘనమైనయదియైన
ననికిఁ దెచ్చుటకుఁ దా నర్హమైనఁ
దడవుగాకుండెడి దండైనమాత్రంబు
వలననే దాడియుఁ గలహములును
దఱచుగా గలుగక తనకుఁ జేకూడిన
కార్యంబు సమమైనఁ గలుగు ఫలము
మిత్రునధీనమై మెఱసి చేరెడిదైన
నరిసీమ చెఱిపెడు నట్టిదైనఁ

గీ॥ బగఱచేతను గ్రానుకల్ పట్టి మగుడు
నట్టిదైనను మిత్రసైన్యంబుఁ గూడి
వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 18

సీ॥ కుక్కక్రొవ్వనుఁ బందిక్రొవ్వుఁ గోరెడు బోయ
వెసఁగుక్కఁ బందిపై విడిచినట్లు
తనుఁగొల్వవచ్చు శాత్రవులసైన్యంబులఁ
బగవారిపైఁ బోరఁ బంపవలయు
నదిగాక వారు బాహ్యంబైన కోపంబు
సేసినచోఁ దనచేరువలనె
నిలుపఁగాఁ దగుఁ జెంత నిలిచిన నాంతర
కోపంబు బుట్టింప గుట్టు దెలిసి

తే॥ యపుడు గనుమలలోపల నడవులందు
గలుగునల కంటకాదుల గదుమఁ బనిచి
వారిచేతనె నొప్పించపలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 19

కం॥ కనుమలఁ గంటకలతులం
బనివడి శోధించునపుడు బరసీమలకుం
జనునప్పు డదవిమూఁకను
దనసేసకు మునుపె పనుపఁ దగు జనపతికిన్ ॥ 20

వ॥ ఇట్లు చెప్పిన షడ్విధబలంబులును రథగజతురగ పదాతులతోడం గూడఁ బ్రత్యేకంబులుగాఁ జతురంగబలంబు లగుచునుండు. కలసన్నాహంబుల నిదియ కోశమంత్రంబులతోడంగూడి షడంగంబు లనం బరగుచునుండు, నిట్టిబలంబుల చందంబు

వెన్నియు మనంబున నిశ్చయింపుచు వైరియోధవితతికిం దగినట్లు ప్రతివ్యూహంబులు గల్పించు విజిగీషువైనరాజు దండయాత్ర గదలందగు నందు. 21

కం॥ బలముల సేనాపతియును
దెలు పలరగఁ జేయుపనులు జేయని పనులుం
దెలియం దగు వారలకుం
గల సన్నాహంబు దెలుఁగఁగాఁ దగుఁ బతికిన్ ॥ 22

వ॥ దళవాయికి. 23

సేనాపతి ప్రభావము

సీ॥ కులజుఁడై తనసీమ నెళవరియై తగి
మంత్రిసమ్మతుఁడునై మంత్ర మెఱిఁగి
దండనీతి యొకింతఁ దప్పక యుండంగఁ
జదివి ప్రయోగించుచంద మెఱిఁగి
విజము సత్త్వము నోర్పు నియుకదయును గల్గి
మాధుర్యగుణగణమహిమఁ జెంది,
తనప్రభావ ముత్సాహసంపదఁగల్గి
తనుగొల్చువారి కాధార మగుచు

గీ॥ నెంమి నధికుల మిత్రుల పొందుఁ గల్గి
చాల దాయాదులును బంధుజనులు గల్గి
యన్ని వ్యవహారములు నేర్చి యెన్నఁగలుగు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 24

సీ॥ రాజ్యాంగములకుఁ బురంబువారలకును
సమ్మతుండై మించి చాలఁ జదివి
కారణంబులు లేని కలహంబులకుఁ బోక
కలఁగక శుభకర్మకలితుఁ దగుచు

నెంధును మోసంబుఁ జెందక శూరుఁడై
వ్యాధులఁ బొరయక త్యాగియగుచు
కడుమంచిపనిఁబూనఁ గలిగి కాల మెఱింగి
సజ్జను లెల్లను జాల మెచ్చ
గీ॥ విక్రమముచేత నెంతయు వినుతికెక్కి
బడలికల గెల్చి తేరుల భద్రకరుల
నశ్వముల నెక్కునేర్పుల నలరి మించు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి॥ 25

సీ॥ మల్లయుద్ధములందు మఱికైదువులఁ జేయు
జగడంబులందును జడుపు లేక
కడువేగదాఁటి పైఁబడెడు పీఁక లెఱింగి
బవరంపునేల తేర్పఱుప నేర్చి
సింహవిక్రమమునఁ జెలఁగి యాలస్యంపుఁ
బనివాఁడుఁగాక కోపంబుఁగలిగి
జాడ్యంబు నొందక చాల నుద్ధతి లేక
మెపుడు ఆనాంతరం బెఱుఁగ నేర్చి
గీ॥ కరితురగరథచయములఁ గైదువులను
గలుగు లక్షణములు తెల్పఁగా నెఱింగి
చక్కదనమునఁ జెలువొందు చతురుఁడైన
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి॥ 26

సీ॥ మేలెఱుంగఁగ నేర్చి చాలంగ దయఁగల్గి
నేర్పరులను గూడి నేర్పుఁ జెంది
జోదులు ధరియించు జోక లెల్ల నెఱింగి
యన్ని యుద్ధమ్ముల యను వెఱింగి

జగదంపు సవరణచందంబు లెఱుఁగుచుఁ
గరులచిత్తంబులు నరులమనసు
హయములహృదయంబు లనువొంద నెఱుఁగుచు
వానిగుర్తులఁ బేరువరుస నెఱిఁగి

గీ॥ వానిబనిగొను నేర్పులు దా నెఱింగి
సకలదేశస్వభావముల్ సకలరిపులు
సకలభాషల నెఱుఁగుచు సరసుఁడైన
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 27

సీ॥ పలుపును వెలుపును మది నెఱుంగక రేయిఁ
జరియింపఁగా నేర్చి శకునగతుల
స్వరవులు దెలిసి నక్షత్రగ్రహంబుల
యస్తమయం బుదయంబు నెఱిఁగి
దిక్కులు దేశముల్ దెఱువులు నెఱుఁగుచు
వాని నెఱింగిన వారి నేలి
యధికభయార్తుల కభయంబు లిచ్చి
గాలికి వాన కాఁకలికి నోర్చి

గీ॥ దప్పిదగలకు నెండకుఁ దాళఁగలిగి
మిగుల దూరంబు పయనముల్ మెలఁగ నొప్పి
పరులమూఁకలఁ జీకాకు పఱుప నేర్పు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 28

సీ॥ కడు నసాధ్యంబులై కనుపట్టు పనులైన
సాధించునేర్పు నిశ్చయముఁగల్గి
చనమూఁక విఱిగిన ననికి నిల్వఁగ నేర్చి
గగ్గోలు జగడంబుగఱు లెఱింగి

బలములు గావించు పను లెఱుంగఁగ నేర్చి
పరుల దూతలచర్య లరయు నేర్చి
ఘనమైనయుద్యోగ మొనరించి వేగమె
యందు ఫలంబులఁ జెంద నేర్చి

గీ॥ పట్టి యాడేర్చుకొనునట్టి పనులు గల్గి
యటుల మెలఁగెడువారల నరసి నిలిపి
పరిభవంబైనయెడఁ గ్లేశపడక యుండు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జను నృపతి॥ 29

ఆ॥వె॥ ఇట్టి లక్షణముల నెంతయుఁ జెలువొంది
పతిహితంబునందె భక్తి గల్గి
చెలఁగు సంపదలను జేకూర్చు ఘను దళ
వాయిఁ జేయ మెలపవలయుఁ బతికి॥ 30

చం॥ ఎడయక రాత్రులుం బవలు నెచ్చరికం దళవాయి మేటులం
వడపులఁ గొండలం గడు భయంకరమైతను దుర్గసీమలం
ల్లడపడకుండునట్లుగ బలంబుల వ్యూహమొనర్చి తాను మె
క్కుడుజతనంబునన్ మెలఁగి చూడుచు సేనలఁగాచుఁగాఁపునన్

ప్రయాణ వ్యసనరక్షణ ప్రకరణము

సీ॥ మేటియౌనొకదారి మిక్కిలి శౌర్యంబు
గలమూఁకతో ముస్నుఁగదలవలయు
రమణీసమూహంబు రాజభండారంబు
చదలంబునడుముగాఁ జనగవలయు
వానికి రెండుపార్శ్వములందు హయములు
హయములపజ్జల నరదములును
వానిపార్శ్వంబుల నేనుగుల్ వానిపా
ర్శ్వంబుల గదియంగ వనబలంబు

గీ॥ బరుగపలయును వీరల కన్నిటికిని
వెనుక దళవాయి బడలినజనముఁ దేర్చి
ప్రోచుచు నాయత్తపాటుతోఁ జనఁగఁ జేయ
వలయు దండెత్తునట్టి భూవల్లభుండు ॥ 32

సీ॥ భయము ముందర గల్గఁ బటుమకరవ్యూహ
మునకైన తెక్కలు దనర విచ్చి
రహి మించునట్టి గృధ్రవ్యూహమునకైన
వీరముఖంబైన తీరుబడిన
సూచికావ్యూహంబు సూటిచేసైనను
బలముల నడిపింప వలయుఁ జెలఁగి
భయము పిఱుందనౌ పట్టున శకటరూ
పంబునమరి పార్శ్వభయములందు

గీ॥ నలరు వజ్రాయుధమురీతి నన్నిదిశల
భయము గల్గిన సర్వతోభద్రరీతి
బలము వ్యూహంబుగాఁ బన్ని బలవిభుండు
నడుపగాఁ జేయవలయు యత్నంబుతోడ ॥ 33

వ॥ బలప్రయాణ వ్యసనములకు. 34

సీ॥ గుహలందు నెఱులందుఁ గొండల నడిత్రోవ
నడవుల నిఱుకటమైన యెడల
బడలిన నాకొన్నఁ గడు దప్పిఁజెందినఁ
గఱవుచేఁ దెవులుచేఁ గలిగియున్న
దొంగలు మారియుఁ దోలుక తిరిగిన
నడుసు నీళ్ళను ధూళి యలముకొనినఁ
జెదరిన సందడిఁ జెందిన నిద్దుర
నందినయెడఁ గూడి హాళిసున్న

గీ॥ కొంచెమైనను సవరణ గూడకున్న
గాలివానల నగ్నులఁదూలియున్నఁ
దనదు సైన్యంబు రక్షించుకొనఁగవలయు
శత్రుసైన్యంబు లటులున్న జదుపవలయు ॥ 35

గీ॥ దేశకాలవిశేషముల్ దెలిసి యరుల
బలము భేదంబు నందించి బలసి చెలఁగు
బలియునకుఁ గూటయుద్ధంబు గలుగదేని
యేయెడఁ బ్రకాశయుద్ధంబు చేయవలయు ॥ 36

కం॥ అడవులు గనుమలు మొదలగుఁ
గడు నిఱుకటమైనచోట్లఁ గళవళపడుచుం
డెడి శత్రుఁ దునుమ వలయును
విడువక గగ్గోలువడెడి వేళలయందుꣳ ॥ 37.

కూటయుద్ధ ప్రకారము

సీ॥ అహితుండు పోట్లాద ననువైనచోటుఁ దాఁ
గైకొని యచ్చోటఁ గదలకున్న
నతనిమంత్రులు మొదలయిన వారల భేద
మొందించి యచ్చోట నునికిఁ జెఱచి
మైన నాటవికసైన్యంబు పేరిటిత్రాళ్ళ
చేఁ జుట్టి పోరికిఁ జెదరఁదీసి
తనమూఁక విఱిగిన యనువున నలయించు
కొనివచ్చి యొక యిఱుకునకుఁ దెచ్చి
గీ॥ వలనెఱుఁగు వీరభటులకు సెలవుఁ బెట్టి
చేరి చుట్టుక జగడంబు చేసియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁగూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 38

సీ॥ జనపతిముందరఁ గనుపట్టుగా నిల్చి
తన కెదు రెక్క శాత్రవునిమీఁద
వెనుకచక్కికి మేటివీరయోధుల నంపి
పొడిపించి స్రుక్కించి కెడపియైనఁ
గాక పిఱిందిభాగంబున మొనసూపి
ముందర నలయించి మొత్తియైన
నొకటి ప్రక్కఁ దా నెదిరించి శూరుల
నవ్వలి ప్రక్కది క్కంపియైన

గీ॥ నటుల నవ్వలిపార్శ్వంబులందు మొనపి
యిప్వలికి శూరతతి నంపి యెంచియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 39

సీ॥ మునుచక్కి విషమమై మొనుపరాకుండిన
వెనుకటిదిక్కునఁ జెనకియైన
వెనుచక్కి మునుచక్కి మొనుపరాకుండినఁ
దొడరి ప్రక్కలఁజేరి పొడచియైన
నదిగాక మఱి తన యడవిమూఁకల శత్రు
బలముల దూష్యులఁ బనిచి మొదట
జగడంబు చేయించి మిగులఁ దా బడలించి
సన్నమై కూఁతలు సడలియున్న

గీ॥ వైరితతిమీఁదఁ బడుచును వాహనములు
గలఁగఁ దనరౌతులను బంపి కడిమియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 40

సీ॥ మూష్యల సరిమూఁకఁ దొలుదొల్త నళికించి
విఱిగి రా నళికించి విఱిగి రనుచు
విశ్వాసమునఁ జెంది విమతు నేమఱినచోఁ
దనదు బల్మి చెలంగఁ దరిమియైనఁ
దాటంబు దిగుచోటఁ బట్టణంబులచోటఁ
బైరుల నూళ్ళను బ్రజలయందు
గొల్లకాసులుచూపి గొల్లలు చాలఁగాఁ
బట్టినచోఁ జుట్టు ముట్టియైన
గీ॥ వేఁటలాడంగ నడవికి వెడలి బడలి
యొండుతఱిఁ జుట్టు ముట్టి చెండియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁగూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 41

సీ॥ మునుపుగా నొకకొద్ది మూఁకల మొనసేసి
కడు గట్టి మూఁకలకడను దాఁచ
నరిమూఁక సరకుసేయక మీఱి గర్వించి
తనమూఁకపైఁ బేర్చి యని యొనర్ప
మునుపు తాదాఁచిన మూకఁచే శత్రులఁ
జేరి చుట్టుక నొంపఁజేసి యైన
నదిగాక పగవారి యావులఁ బట్టించి
వార లందుకుఁగూయవచ్చుచోట
గీ॥ నడుమతెరువున నరికట్టి నడికియుండి
కడిమిమై చుట్టుముట్టుక పొడిచియైనఁ
గూటయుద్ధంబుచే శత్రులఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 42

సీ॥ గగ్గోలుచే భీతిగలిగి రాత్రులయందు
నిద్రఁగానక పగల్ నిద్రఁ జెంది
యులపె యేమఱినచో నదరిపాటుననైనఁ
బగ లెల్ల నాయత్తపాటు చెంది
బవలినచోట మాపటిజామునందైన
నడురేయిఁగడు నిద్ర దొడరువేళ
చేతిరిజగడంబు రీతి దానెఱుఁగుచుఁ
బయిజోళ్ళ కొమ్ముకత్తులును గల్గి

గీ॥ పసులచేనైన వేగంబు గలిగినట్టి
వీరతతిచేతనైనను జుట్టుముట్టి
పాటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 43

సీ॥ ఎండకుగాలికి నెదురెక్కి కనుమోడ్చి
సుడివడి తడఁబడుచోటనైన
నదిగాక క్షుద్రంబు లగునట్టియడవుల
మంచున మబ్బుల మలలఁ బొపల
వాఁగుల వ్రంతలఁ దీఁగెల గుంతల
తాల నేఱులను బోరానియొఱుకు
తెరవుల నరికట్టి తిరుగువారుచునైన
మిగులఁ దా నచ్ఛిద్రుఁ డగుచు నుండి

గీ॥ యదనుఁ జేకొని పైఁబడి చరిపి యైనఁ
బదరి తనమూఁక బదలిక పడఁగనీక
పాటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 44

గీ॥ ప్రాణములయందుఁ గడు నాసపాటు లేక
విఱిగిఁ లజ్జించి తిరిగిన వీరవరుఁడు
మొక్కలంబునఁ బైఁబడి మొత్తుఁగాన
మిగులఁబఱిగినఁ బఱుపఁగాఁ దగదు పతికి॥ 45

గీ॥ ఇటులఁ గపటంబు జగడంబు లెఱిగెనేని
గడు ననాయాసమున గెల్వ గల్గుచుండుఁ
గాన భూమీశుఁడగువాఁడు గపటయుద్ధ
సరణిచేతనే శత్రులఁ జదుపవలయు॥ 46

వ॥ క్షయస్థాన వృద్ధులకు. 47

కం॥ వెచ్చము నాయము సమమై
వచ్చిన స్థానంబు మఱియు వ్యయ మధికంబై
వచ్చిన క్షయ మం దాయమె
హెచ్చిన నది వృద్ధి దీని నెఱుఁగఁగ వలయున్॥ 48

ఉ॥ ధారయుత్సాహము గల్గి మోసగతులెందుంజెందఁగా నేక దే
సరణిన్ వైరుల గెల్చునట్లు రిపులన్ సాధింతు నన్ శంకఁదా
నిరతంబున్ మది నిల్పి చారతతిచే నేర్పుల్ పగన్ శత్రులం
దరయంగాఁదగు సర్వకార్యములు నూహాపోహసన్నాహియై॥ 49

ఉ॥ మోసపుపోరిచే రిపులమూఁక నవశ్యము నొంచఁగా నగున్
వేసటలేకయుండుపృథివీపతి యీగతి శత్రు గెల్చుటల్
దోసముగాదు మున్నిటుల ద్రోణసుతుండును ద్రౌపదేయులం
ద్రాసముఁ బూని యేమఱినపట్టున నొంపఁడె నిద్రవేళలన్॥ 50

## చతురంగబల ప్రయోజన ప్రకారము-గజకర్మ

సీ॥ దండయాత్రలను ముందరఁగాఁగ నడచుట
వనదుర్గములు చొచ్చి చనుట మఱియుఁ
దెఱువులు లేనిచోఁ దెఱువులు వెట్టుట
కొలఁకుల నదుల లోఁతులును దెలిసి
బలసమూహంబుల జలముఁ దాటించుట
యసహాయగతి జయ మందుటయును
దూరరాని మూఁకలఁ జొచ్చి భేదించుట
పేర్చి వేఁగినమూఁకఁ గూర్చికొనుట

గీ॥ పాదపుల వెఱపుచూపుట పాదపులైన
కోటయును గోటవాకిళ్ళు గూల్చుటయును
శాల భండారములు మోపఁ జాలుటయును
భయము దీర్చుట గజముల పను లటంద్రు ॥ 51

## రథకర్మ

క॥ తనసేనల రక్షించుట
యనిఁ జెదరినఁ గూర్చికొనుట యరిసేనలఁ దా
కొనియుండిన భేదించుట
యును నరికట్టుటయు రథము లొనరించుపనుల్ ॥ 52

## అశ్వకర్మ

సీ॥ కొండలదండ దిక్కుల మార్గములయందు
విమతులమూఁకల వెదకుటయును
ధాన్యాదులను మిత్రతతుల రాఁ జేయుట
వేగంపుఁబనులు గావించుటయును

బరుల వెంటాడుట తిరుగుచో విఱుగుట
విఱిగియుఁ గ్రమ్మఱ వెంటఁబడుట
మునుచక్కి నడుచక్కి వెనుచక్కిఁ బ్రక్కల
పొదివి పొంకమెఱింగి పొడుచుటయును

గీ॥ వైరి యశ్వాళిపై మీఱి పోర జొరఁగి
పోయి పాళెంబుపైఁబడి పొడుచుటయును
దీను లగువారిఁ దోడ్కొని తెచ్చుటయును
వాడిపెడలుట గుఱ్ఱపుదళముపనులు ॥ 53

పదాతికర్మ

సీ॥ ఎపుడుఁ గైదువులు దా మేమఱకుండుట
త్రోవల బావుల రేవులందు
నేఱుల విడిదలయెడఁ గపటంబులు
దెలియుచుఁ దిరిగి శోధించుటయును
తృణకాష్ఠజలములు దెచ్చుచోటులయందు
మిగుల నెచ్చరికతో మెలఁగుటయును
రేయును బగలు భూపాలుఁ గాపాడుట
చెప్పిన యట్లనె చేయుటయును

గీ॥ ఇవియ మొదలుగఁ గలిగిన యిట్టి వెల్ల
బలము లొనరించు పను లందు తెలిసి చూడ
నిటులఁ జతురంగములపను లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 54

సీ॥ మంచిజాతియుఁ బరిమాణంబు వేగంబు
స్థానంబు వయసును సత్వములును
విలుకాడ పనులందు నేర్పును దేజంబు
చెప్పినకైవడిఁ జేయుటయును

ఘనతయు భద్రలక్షణముల నాయువుఁ
గలిగి యెన్నికమీఱ మెలఁగుటయును
సత్త్వంబులను నేనుఁగులకును మఱియును
గాలిమందికిని లక్షణములెందు

గీ॥ నిటుల బలముల లక్షణం బెఱిఁగి యెపుడు
వాని వానికిఁ జేయఁగా వలయు పనుల
యందు నియమింపఁగాఁ దగు హరువు లెఱిఁగి
నీతిమార్గం బెఱిఁగిననృపవరుండు ॥ 55

వ॥ చతురంగ బలముల నేలలకు. 56

గీ॥ గుంటలును మిట్టలును జెట్లు గొప్పతాళ్ళఁ
బుట్టలను మోటుచెట్టులు బొదలుగల్గి
మెలఁగఁగా వచ్చి ముండ్లును గలుగదేని
కాలిమూఁకల పనిసేయు నేల యండ్రు ॥ 57

వాజిభూమి

కం॥ జలమును నడుసును నెఱియలు
గలుగక ఱ్ఱాకులును ఱాలుఁగను లేక సమ
స్థలమై మెలఁగఁగ వచ్చుచు
నలరిన గుఱ్ఱములనేల యగు నండ్రుబుధుల్ ॥ 58

రథభూమి

సీ॥ ఇసుకలు మొద్దులు నెందెందె యుందక
బలుగుండ్లు నడుసు గుంటలును లేక
చేలును మళ్ళును జెట్లుఁ దీగలు లేక
గుంతలుఁ బొదలు వాఁగులును లేక

నెఱియలు నొడ్డులు బొఱియ లేమియు లేక
పది దాఁట గొరిసెతాఁకుడుల కోర్చి
కడుగట్టిమై బందికందులు గలఁగక
చదరమై మిగుల విశాల మగుచు
గీ॥ నిసుడ మగుడంగఁ దగునట్టినేలలందు
సరదములు జగడము సేయ నమరుచుండు
నిట్టిజగడంపునేలల నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 59

నాగభూమి

సీ॥ త్రవ్విచివేయఁగవచ్చుతీవియల్ గలయది
పట్టి విఱువవచ్చుచెట్టు గలద్ది
యిసుకలు నసలును నెసఁగనియది యును
సేనల కెందు రాఁబోనియదియు
ఘనములై కనుపట్టు గట్టులు గలయది
కడు గుంట మిట్టలు గలుగునదియు
గలయంగ నుడుగు వేరులుగలయదియును
నని సేయఁ గరులకు సర్వమైన
గీ॥ నేల యదిగాక యెటువంటి నేలయైనఁ
గవుల కగు వాని కెందు నగమ్యభూమి
గలుగకుండుట గాదె నాగంబు లయ్యె
నిట్టిభూముల నరవరుఁ డెఱుఁగవలయు ॥ 60

సీ॥ అని మొన విఱిగినయశ్వాదిబలముల
నిలుపఁగా నోపుచు బలము రాజు
వెనుకదిక్కునందు నిల్చిన ప్రతిగ్రహ మంచు
రదియు నిన్నూఱువిండ్లంతదవ్వ

గీ॥ సహితుచనవరినైనను హయమునైన
వెనుకఁ దియ్యక చంపిన వెయ్యిమాళ్ళ
బంటుతలఁగొట్టి తెచ్చిన బంటునకును
బతి యొసంగఁగఁదగు రెండు పదులమాళ్ళ ॥ 64

కం॥ పరబలముల కెదిరింపుచు
నురువడి శౌర్యంబుఁజూపు యోధుల కెందున్
నరవరుఁ డినుమడి జీతం
బరయుచుఁ దా నియ్యవలయు నందఱు మెచ్చన్ ॥ 65

గీ॥ ధరణినాథుల కర్హమై తగినయట్టి
కరితురంగాదివస్తువుల్ గాక యన్య
వస్తువుల నాజి గెల్చి యెవ్వార లెందు
నేమి దెచ్చినఁ బతి వారి కియ్యవలయు ॥ 66

కం॥ అనిలోన గెలిచి వచ్చిన
తనభటులకుఁ దగిన వస్తుతతి నొసఁగుచు న
మ్మనముల సంతోషమ్ములఁ
గనఁ జేయఁగవలయు ధరణికాంతుం డెపుడున్ ॥ 67

## వ్యూహవికల్ప ప్రకరణము

వ॥ బారులు తీర్చుటకు, 68

సీ॥ మొనకు ముందఱ విలుమూఁకల నిల్పుచో
బారులసందున వారలకును
ధనువంతనేల యంతయ నెడఁగా నిల్పి
యచటికి మూఁడు విండ్లంతనేల

*(ఒండొంటికిని నెడ నొప్పునట్టుల గుఱ్ఱ
ముల బారు నిల్పఁగావలయు దాని)
వెనుక నేనుఁగుబారులను నిల్పఁగాఁ దగు
వానికి వెనుచక్కఁ వరుసతోడ
గీ॥ నటుల నరదంబు బారుల నమర నిల్పి
నగు ధనుర్మాన మనఁగ నీ యవనిలోన
నైదు మూరలపొడవగు నది యెఱింగి
వారు నిటు తీర్పవలయు భూపాలవరుఁడు॥ 69

సీ॥ ఇట్టి వారులలోన నెడనెడ విలుకాండ్ర
కును వాజులకు నేనుఁగులకు మఱియు
నరదంబులకును బాహ్యాంతర భూముల
క్రమ మొప్పుచుండు నొక్కటియు మూఁడు
నైదు నైదగు సంఖ్య నమరిన శమముల
యంతరప్పుల నిల్పి యర్థ మొందు
నట్టి శమంబును నమరఁ జతుర్థశాం
గుళసంఖ్య ధరణిలోఁ దెలిసి చూడ
గీ॥ నిన్నియు నెఱింగి బారుల నిటులఁ దీర్చి
పోరగాఁదగు నిదిగాక పోరఁ దనకు
నెటులఁ బొంకంబుసందడి యెసఁగ దెటులఁ
జేరువగు నెటు లటులైనఁ బోరవలయు॥ 70

## వ్యూహరచనా ప్రకారము

వ॥ మఱియు బలంబులు దొట్టుకొనకయుండ ననేక ప్రకారంబు లెఱింగి వ్యూహంబులు బన్ని ఆగడంబు చేయించవలయు నవ్విధం బెట్టిదనిన గజానీకంబును, రథానీకంబును, మిశ్రానీకంబు

* [... .. . . .. ....]

నన ననీకంబులు మూఁడు దెఱంగులై యుండు నందు గజంబు
తొమ్మిదియును, నందొక్క గజంబునకు ముందర జగడంబు
సేయు గుఱ్ఱంబు లేనింటి చొప్పున నలువదియైదు గుఱ్ఱంబులును
నందొక్క గుఱ్ఱంబునకు ముందర జగడంబు సేయు వీరభటులు
ముగ్గురి లెక్కను నూటముప్పదియైదుగురు వీరభటులును నిట్లు
పాదసంరక్షణార్థంబు పార్శ్వంబుల యందుఁ గాచికొని యుండు
గుఱ్ఱంబులు నలువదియైదును, వీరభటులు నూటముప్పదియైదు
గురును గూడి తొమ్మిది గజంబులును, దొంబది గుఱ్ఱంబులును
నిన్నూట డెబ్బది సంఖ్యగల వీరభటులును గలయది గజానీకం
బనం బగు, నీ ప్రకారంబునఁ దొమ్మిది రథంబులును, దొంబది
గుఱ్ఱంబులును, నిన్నూట డెబ్బది సంఖ్యగల వీరభటులును గల
యది రథానీకం బనం దగు. తొలుదొల్త వీరభటులును, వారల
వెనుక గుఱ్ఱంబులును వాని పిఱుందను రథంబులును, వాని
వెనుకఁ బక్క నేనుంగులును గలయది మిశ్రానీకం బన నొప్పు
నిట్టి యనీకసమూహంబే వ్యూహం బనం బరఁగు. నదియు
దండవ్యూహంబును, భోగవ్యూహంబును, మండలవ్యూహంబును
నసంహతవ్యూహంబును నన నాలుగు దెఱంగులై యుండు. మఱియు
నేతద్భేదంబులైన వ్యూహంబు లనేకంబులు గల వది యెట్టింగ
వ్యూహంబులు నున్ననపు డనీకానీకమధ్యంబున నైదేసి విండ్లంత
దవ్వుగలుగఁ బన్నవలయు, నం దసంహృతవ్యూహంబున
ననీకంబులు దూరంబున నిల్చునట్లుగాఁ బన్నవలయు, నిట్టి
వ్యూహంబునకు శుక్రమతంబువార లురోభాగం బొకండును
బార్శ్వభాగంబులు రెండును, మధ్యపుచ్ఛభాగంబులు రెండునుం
గూడి పంచాంగంబులుం గలవం దురం దునకుఁ దనకుం గల బలంబు
మూఁడుపాళ్ళుగ నేర్పఱచి యురోభాగంబున నొకపాలును,
బార్శ్వభాగంబుల నొకపాలును, మధ్యపుచ్ఛభాగంబుల నొక

నాలుగుసుంగా నిలుపవలయునండ్రు. మఱియుఁ గొన్నిమతంబుల వారికి పంచాంగవ్యూహంబునకే యంగంబున కొక్కొక్క యనీకంబు లెక్క ననీకంబులై దింటికి ముందర జగడంబుసేయు వార లాఱునూట డెబ్బదియైదుగురు వీరభటులును, నిన్నూట యిరువదియైదు గుఱ్ఱంబులును, నలుపదియైదేనుంగులును నిట్టివె పాదసంరక్షణార్థబలంబులుంగూడి వేయినిన్నూట యేబదిసంఖ్య గల వీరభటులును, నన్నూటయేబది గుఱ్ఱంబులును, తొంబది యేనుంగులును గలిగి యుండవలయు నండ్రు. వెండియు బృహస్పతిమతంబు వారికి పంచాంగవ్యూహంబునకే పక్షభాగం బులు రెండునుంగూడి హస్తాంగంబులం బ్రవర్తిల్లసంమిళింపునకుం గల బలంబు నాయునపాళ్యానరెంచి యురోభాగంబుల నొకపాలును, కక్షభాగంబుల నొకపాలును, పార్శ్వభాగంబుల నొకపాలును, మధ్యపుచ్ఛభాగంబుల నొకపాలునుంగాఁ బన్ని జగడంబు సేయింపవలయు నండ్రు. 71

సీ॥ తమలోనఁ దాము సందడిపడి వలయక
యని యొసర్పఁగఁ దగ నదియుఁ గాక
కలిసి పోరాడ సంకుల సమరం బను
నట్టి సందడికయ్యమందు నెల్లఁ
సమయేనుఁగుల దండఁ దాఁగొని జగడంబు
సేయఁగావలయు నజేయలీలఁ
దమమూఁకమీఁద గుఱ్ఱములు పైకొన్నచో
నొండొరుల్ చెదరకయుండి పోర

గీ॥ వలయు బాణంబులును దుపాకులును విండ్ల
మూఁక ముందర నిడికొని మొనకు నడచి
యెట్టి మూఁకలు పైకొన్న నట్టిమూఁక
చేతఁ బోరింపవలయును క్షితివరుండు॥ 72

## ప్రకాశ యుద్ధ ప్రకరణము

వ॥ సేనాంగాలకుఁ బ్రత్యేకనాయకులకు, 73

చం॥ కులమున మించువారిఁ దమకుం దగులైె తగువారిఁ బోరిలో
నలవడి తత్ప్రతిక్రియల నన్నియుఁ జేయ నెఱుంగువారిఁ గ్రే
వల దమమూఁకఁ గావఁ గలవారల నేనుఁగు లాదియైన మూఁ
కలకును వేఱువేఱ నధికారులఁగా నియమింపఁగాఁ దగున్॥ 74

కం॥ ఈరీతి వ్యూహములుగా
నేరుపుతోఁ బన్నినట్టి నిజబలములచే
వైరిబలంబుల మీఱి వి
దారింపఁగవలయుఁ గదిసి దళవాయి తగన్ ॥ 75

కం॥ బలిమిగల వైరిబలముల
బల మినుమడి గలిగినట్టిబలములచేతన్
గెలువఁదగుఁ దెలిపి చూపని
బలముల నేనుఁగులఁ బఱపి పఱపఁగవలయున్ ॥ 76

## గజబలప్రశంస

లయగ్రాహి॥ మెండగు జిరాలురముదండ బలుకేడెముల్
నిండుకొను గుమ్మలును చండితలరాణుల్
గండపుర బూనుచుఁ బ్రచండమదమత్తులగు
దండిమగ లేమఱక భండనములో ను
ద్దండగతి లోహమయదండములు బూనుకొని
నిండుపమటోకఁదగుచుండు పరసేనం
జెండఁ జనునందుఁ గలగుండుపడ వాద్యముల
డిండిమ డిమండిమ డిమండిమ లెసంగన్ ॥ 77

చ॥ ఘనుఁడగు మావటీఁడు మొనగాలునఁ గేలున నంకుశంబునన్
దను బురిగొల్పఁ దొండము ముదంబునఁ జాపుచు వాలమెత్తుచున్
గనుగవయుం జెవుల్ నిగుడఁగాఁ దనసేన నెఱింగి శత్రుసే
నను నురుపాడి గెల్పు నరనాథున కిచ్చుఁగదా గజం బనిన్॥ 78

ఉ॥ ఏనుఁగు లున్నచోనె వసియించును శ్రీహరిరాణి సంతతం
బేనుఁగు పౌఁజుగల్గుదొర యేమిట నోటమిఁ జెందఁ డెట్టిచోఁ
గాన పదేభయూధ మధికంబుగఁ గొల్వఁగ దంతి నెక్కి సం
ప్రాణముతోడి దుర్గము నృపాలకుఁ డెక్కిన యట్ల పోరిలోన్॥

చ॥ పొడవగు భద్రప్రదేశముల దుర్గములై పతిఁ బాఱు సేయులన్
గడవఁగ నోడకై రణముఖంబున రాక్షసులై ప్రయాణముల్
వెడల గృహంబులై మనసు వెచ్చగఁ జూడను గారణంబులై
కడుమద మెచ్చు నేనుఁగులె నా జయసాధనముల్ దలంపఁగన్॥

చ॥ బలిమి మదంబునుం గలుగు భద్రగజంబుల రాజు శత్రుమూఁ
కల నురుపాడి చెందుగఁ గరాపికచేసి జయించి నేనుఁగుల్
బలువుగ గల్గినన్ జయము బ్రాఁతియె కావున వానిఁ బ్రోవఁగా
వలయు నృపాలశేఖరుఁ డవశ్యముఁ దా జయలక్ష్మి మించఁగన్॥

సీ॥ పొగడపువ్వులతావి పొదివి ఘుమ్మల్కొన
వెదజల్లు సంతతమదముఁ గల్గి
తేనెవన్నియ గల్గి దీప్తమై పొడవులై
వలుదలై పొలుచు కొమ్ములును గల్గి
బొరయుచు సమములౌ తుంటి దిక్కులుగల్గి
యొద్దికై కూడి పెన్నుద్దు లనఁగ
బెరయుచుండెడునట్టి బృంహితస్వనములు
సమములైనట్టి యంగములుగల్గి

గీ॥ సకలశుభలక్షణంబులు చక్కఁదనము
చెలువు గంభీరగమనము గలిగినట్టి
భద్రగజముల నేలుభూపాలకుండు
సకలసంపదఁ జెందు జయము బాగుగ॥ 82

చం॥ గజములు గల్గు భూవిభుఁడు గా నొకదిక్కున గాక యెల్లెడన్
గజములు గల్గువాఁడు ధరఁ గల్గడు కావున నింతికోటులన్
గజముల లీల సత్త్వములఁ గన్పడు బంటులఁ జెంత చేసినన్
విజయము తేజమున్ సిరులు విశ్రుతకీర్తులు గల్గు భర్తకున్॥

రథబల ప్రశంస

ఉ॥ భూరతగల్గు సారథులు చొక్కపు తేజులు కింకిణీయుత
త్కారమహారవంబు బిరుదధ్వజకోటులు మెఱఁ బొంగఁగా
వైరిమనోరథంబులను వారిరథంబులఁ గూల్చి పోవు నట్టి
తేరులవారు గల్గు నరదేవున కెద్ది యసాధ్యమే ధరన్॥ 84

అశ్వబల ప్రశంస

కం॥ ఏటికిఁ గరు లేటికి నరు
లేటికి మఱి రథచయంబు లీధరలోనన్
పోటగు జయము నొసంగెడి
ఘోటకములె చాలఁగలఁ గువలయపతికిన్॥ 85

సీ॥ నిలిచెనా యరుగులోనే నిల్చి చిత్రమై
కదలెనా బాణవేగము దెరల్చి
యనినిఁ గైదువుల సాధనకానిగతిఁ బొల్చి
దాఁటెనా లేఁడిచందం బదల్చి

గమకించెనా సింహగమనంబు గమకించి
యదఁగెనా తాఁబేటియనువు మించి
చుట్టెనా వేదెంబు సుడిగాడ్పు నదలించి
బెళికెనా బేడిసబెళకు బెళికి

గీ॥ యెడమ కుడి వాగెబాగుల నెత్తిఁగి తిరుగ
నిరుదెఱఁగుమోము లనఁదగి హరువు మురుపు
వెఱవు నొఱపును గదుమించు నరుదుబిరుదు
నదుటు నుదుటొందు తేజి రాజార్హమంద్రు॥ 86

చం॥ తలఁప నవేళలన్ మిగులఁ దాఁ బగులై తగుసట్టి చుట్టమై
యల రణభూమి పేరఁదగు సంబుధి దాఁటగ మేటితేఁపమై
సలరగఁ గ్రీడలన్మెలఁగు నప్పుడు దా వెలలేని రత్నమై
జెలఁగెడు గుఱ్ఱ మేహితము సేయదు నాయకుఁ డై సహానికిన్॥

చం॥ బలువగు కందముం బిరుదు బంగరుఛాయహసించు సంపదన్
గల పరిపూర్ణదేహము విలాసముఁ జక్కఁదనంబు నోజయుఁ
గళలును జెల్వు తేటతెలిగన్నులు లక్షణముం జవంబుసుం
గలిగిన తేజులన్ సిరులు గైకొను భూభుజుఁ డేలఁగాఁ దగున్॥

కం॥ ఏ నరపతి గుఱ్ఱంబుల
సేనలచే మిగులఁ బ్రబలు క్షితిలో నెపుడున్
వానిది సిరి వానిది ధర
వానిదె జయలక్ష్మి కీర్తి వానిదె సుమ్మీ॥ 89

చం॥ ఈగతి నీతిమార్గమున నెంతయు సుస్థిరుఁడై స రాజు దా
ధీగరిమన్ వహింపుచును దిగ్విజయంబును సర్వసంపదల్
భోగము గల్మియుం గలిగి భూవిభులెల్లను జేరికొల్వ సు
ద్యోగము లెల్లఁ జేకుర సుఖోన్నతి రాజ్యముసేయు నిచ్చలున్॥

ఉ॥ శ్రీరఘురామపాదసరసీరుహభృంగదనూనమానసో
దార మదారివీరవరదర్పవిమర్దన దుర్దమక్రియా
స్ఫారభుజాబలాధిక విసారిత పూరితలోక సద్యశో
హారవిహారమానితమహాకరివాజివిరాజితాంగణా ॥ 91

మంగళమహాశ్రీ ॥

శ్రీమహితధామనుత సింధువృతభూస్థలివిశిష్టహితభాసిత గుణశ్రీ
కాముకకథాకృతినికాయకృతివర్జిత ప్రకాశిత నయాధిక జయశ్రీ
రామ హిమధామ శరరాజి సురరాజ తరురాజిత విశాలసుయశశ్శ్రీ
ధామరమణీయనిజభూజనసుఖప్రదప్రభుత్వయుతమంగళమహాశ్రీ

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత
భారద్వాజసగోత్ర జక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన
విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ
ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు
సేనావివరంబును, సేనాపతిప్రభావంబును కూటయుద్ధప్రకారంబును
చతురంగబలప్రయోజనంబులును దర్పాములును వ్యసనంబులును
బారితోషికంబును జతురంగబలప్రశంసయు నున్నది సర్వంబు
నష్టమాశ్వాసము.

మ॥ రమణీయంబుగశాలివాహశకవర్షంబుల్ గతంబై సహ
స్రము నేనూటను నాలునై వెలయఁగా బ్రౌఢిం దెనింగించి రా
ర మహిం దిమ్మయ వెంకటాద్రి విభుపేరన్ వేడ్కఁగామందకీ
యము శ్రీవేంకటరామకృష్ణులు స్వభావస్వబద్ధంబునన్ రూఢిగన్॥

శ్రీ శ్రీ శ్రీ

Rathna Press, Tirupati — 1950.